

Chandamama, March '50

Photo by B. Ranganadham

వసంతము

## ఆరోగ్యానికీ, రుచికరానికీ



పూజలకు, వివాహాలకు




## గడియారం మార్కు కర్పూరము

ఉపయోగించండి

**గోపాల్‌జీ చాంపమ్‌షీ & కో.**
నెం. గోవిందప్ప నాయక్ వీధి, మద్రాస్



## డోంగ్రేగారి

### బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియిచ్చు. పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K.T. Dongre & Co. BOMBAY - 4

## 1950 లో మీ జీవిత ఫలాలు

★

12 రాసుల నక్షత్రాలకు అత్యద్భుత ఫలితాలు కల పైపుస్తకాలు అప్పుడే అయిపోవచ్చినవి. వెల 0 - 4 - 0. అయిదణాల బిళ్లలు పంపితే బుక్ పోస్టులో పంపిస్తాం. న్యూస్ ఏజంట్లుకు మంచి ఛాన్సు !

★

వసంతా బుక్ డిపో:
1/27 హైరోడ్డు: రాయపేట, మద్రాసు 14.

మార్చి 10 వ తేదినుండి

రాగిణీవారి

# తిరుగుబాటు

"వచ్చిందమ్మా వచ్చింది !
ఉరుకుల పరుగుల వచ్చింది !
ఉగాది పండుగ వచ్చింది !
"తిరుగుబాటు" వచ్చింది !

డైరెక్టర్... పి. పుల్లయ్య, బి.ఎ.

డిస్ట్రిబ్యూటర్లు:
ఆంధ్రా, సీడెడ్ : చమరియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ.
మైసూర్, నైజాము : కర్ణాటక ఫిలింస్, బెంగుళూరు.

# చందూ యొక్క సాహసకృత్యములు



















ది తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్



# చందమామ

పిల్లల కథల మాసపత్రిక
సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 6 } మార్చి 1950 { సంచిక 3

## అట్టమీది బొమ్మ

ఒకనాడు, గోపికలందరూ కలసి "కృష్ణా! క్రీడలన్నిటిలో గొప్ప అనందమిచ్చే 'రాసక్రీడ' ఆడుకుందాము, రావలిసింది" అని కోరారు. అందుకు కృష్ణుడు "అలాగే ఆడుదాము; శరత్కాలంవరకూ వేచిఉండండి" అని చెప్పాడు.

ఇంతలో శరదృతువు వచ్చేసి భూలోకమంతా పచ్చటిచేలతో, రంగురంగుల పువ్వులతో, అందరకూ ఆనందదాయకంగా వున్నది. ఇటువంటిసమయంలో, పుచ్చపువ్వువంటి వెన్నెల కాస్తూవుండగా, చిన్నారికృష్ణుడు ఒక రోజున తన మురళి వాయించుకొంటూ ఒక అందమైన వనంలోకి వెళుతున్నాడు. గోపికలందరూ ఆ మురళీధ్వనికి తన్మయులై "ఎక్కడ, ఎక్కడ, ఈగానం?" అనుకొంటూ కృష్ణునివెంట పడ్డారు.

కృష్ణుడు,చిరునవ్వుతో "ఇదేమిటి, రాత్రిపూట మీరు ఒంటరిగా రావచ్చునా? మీ భర్తలకుతెలిస్తే కోపగించరా?" అన్నాడు.

అప్పుడు వారు "కృష్ణా! నీవుచేసిన వాగ్దానం మరచావా? శరదృతువు వచ్చిందికదా, రాసక్రీడ ఆడితేనే తప్ప మేము పోము" అని పట్టుపట్టారు.

అప్పుడు, వారిమాట కాదనలేక, కృష్ణుడు రాసక్రీడ ఆడి, గోపికలకు చెప్పలేని ఆనందం కలుగజేశాడు. ఈవిధంగా శ్రీ కృష్ణుని సాన్నిధ్యంపొంది గోపికలు తన్మయులైనారు.






వయసు మీరినట్టి యొక్క
వృద్ధురాలి చూపు చాల
తగ్గిపోవ పాప మామె
వైద్యునొకని ఆశ్రయించె.
నిత్య మతడు ఆమె కడకు
వచ్చి మందు వేయుచుండె
వచ్చినప్పుడెల్ల నొక్క
వస్తువెగిరి పోవుచుండె.
కొంతకాల మిట్లె గడువ
కోరినట్లె ముసలియామె
చూపు బాగుపడెనుగాని
చూడ ఇల్లు కొల్లపోయె.
జరిగినట్టి మోసమంత
ఎరిగి ముసలియామె పిదప
వెజ్జువచ్చి కట్నమడుగ
వెళ్ళుమనియె కళ్ళనురిమి.
అత డంత కోపగించి
అవ్వ నపుడు న్యాయమూర్తి
కడకుదెచ్చి అడుగనామె
ఖచ్చితముగ నిట్లుజెప్పె:
'మందు పుచ్చుకొంటిగాని
మార్పులేదు చూపు నందు
కొంపలోని వస్తువేది
కానుపించదయ్య నాకు.'
అవ్వ చెప్పి నట్టిమాట
అర్థమెరిగి న్యాయమూర్తి
నిలువవీయ వైద్యుడంత
తలను వంచి తరలిపోయె.



రచన : ఆలపాటి సుబ్బారావు

# పరామర్శ



అనగా అనగా ఒక ఊళ్ళో
అన్నా తమ్ముడు ఉన్నారు.
తమ్ముడు ఘనుడై ఆ ఊళ్ళో
తగువులు తీరుస్తున్నాడు.

కొన్నాళ్ళిట్లే గడువంగా
అన్నకు పుట్టిం దొకబుద్ధీ.
'తమ్ముడ! కొన్నాళ్ళింటో చూడు
తగువులు తీర్చెద నే' నన్నాడు.



కిమ్మనకుండా తమ్ముడు సరియనె
పెత్తనమన్నే చేస్తున్నాడు.
ఇంతలో ఊళ్ళో ఎవరిపెళ్ళమొ
వింతగ కాలంచేసింది.

తమ్ముడు మునుపొకసారీలాగే
తల్లి గతించిన ఒక్కరితో
'ఆవిడ మీకే కాదండీ!
అందరకూనూ అమ్మే' ననెను.



మర్యాదంటే ఇంతేగదయని
మంద బుద్ధితో అన్నయ్యా,
'పాపం ఆవిడ మీకేగాదు
పల్లె కంతకును భార్యే' ననియె.

'చాలు న్నోర్ముయ్' మంటూ ఆతడు
నాలుగు తన్నులు తన్నేడు.
సత్తాలేకనె పదవికిపోతే
మెత్తగ తన్నులు తింటారు.

రచన: ఆలపాటి సుబ్బారావు.




పూర్వం వృకాసురుడని ఒక రాక్షసుడుండేవాడు. 'వృకము' అంటే తోడేలు. అది సాధుజంతువుల్ని మ్రింగేసే క్రూరమృగం. వృకాసురుడుకూడా తోడేలుకు మల్లే లోకంలోఉండే సాధుజనుల్ని పీడించి హడలగొడుతుండేవాడు. ఇలాఉండగా ఒకనాడు వాడికో దుర్బుద్ధిపుట్టింది. "చచ్చు మనుషుల్నీ, చచ్చు దేవతల్నీ బాధపెడితే ఏముంది? నేను ఏడిపించదలుచుకుంటే మహాదేవుడని పిలిపించుకుని గొప్పగాతిరిగే ఆ శివుణ్ణే ఏడిపించాలి" అనుకున్నాడు.

అదేసమయానికి నారదమహర్షి ఆదారిని వచ్చాడు. వృకాసురుడు ఆ మహర్షికి నమస్కరించి, "స్వామీ, నాకు పరమశివుణ్ణి వశం చేసుకోవాలని ఉంది. మార్గం ఏమిటి?" అని అడిగేడు.

నారదుడు, "భగవంతుణ్ణి వశం చేసుకోవాలనిఉంటే ఎవరికైనా ఒక్కటే మార్గం. అదేమిటంటే తపస్సు చెయ్యటం. చాలా శుచివైయుండి, దీక్షతో తపస్సు చెయ్యి. శివుడు ప్రత్యక్షమై నీకు వరాలిస్తాడు" అని చెప్పి, తన దారిని వెళ్ళిపోయాడు.

వృకాసురుడు 'సరే' అనిచెప్పి, నదిలోకి వెళ్లి స్నానంచేసి తపస్సుచేశాడు. ఎన్నాళ్లకీ శివుడు ప్రత్యక్షం కాలేదు. ముక్కుమూసుకుని ఉత్తుత్తి తపస్సుచేస్తే లాభంలేదని తలిచి, వృకాసురుడు ఒక క్రొత్త పద్ధతి కనిపెట్టేడు.

ఒక పెద్ద హోమగుండం తయారుచేసి, తన శరీరంలోంచి మాంసఖండాలుకోసి ఆ గుండంలో వెయ్యటం మొదలెట్టేడు. అయినా శివుడు ప్రత్యక్షం కాలేదు! తన శరీరంలో మాంసం అంతా కోసి గుండంలో వేసినా శివుడు ప్రత్యక్షం కాకపోవటం చూసి, వృకాసురుడికి ఇంకా పట్టుదల

పి. సౌభాగ్యలక్ష్మి





ఎక్కువై ఒక సాహసం చెయ్యబోయాడు. ఏమిటంటే, తన తలనే నరుక్కుని హోమం చెయ్యాలని. అందుకు సిద్ధపడ్డాడుకూడా.

ఇదంతా కనిపెడుతున్న శివుడు యిక అలస్యం చెయ్యలేదు. తక్షణం ప్రత్యక్షమై, "వృకాసురా, నీ సాహసానికి మెచ్చుకున్నాను, లేవయ్యా ఇంక. అయ్యో పాపం శరీరంలో ఉన్న మాంసమంతా కోసి హోమం చేసేశావే! నేను అనవసరంగా ఆలస్యంచేశాను. ఐతేనేంలే. వచ్చానుగా ఇప్పుడు. ఏంవరంకావాలో కోరుకో," అన్నాడు.

ఏంవరం కోరుకోవాలో వృకాసురుడు మొదటే ఆలోచించుకున్నాడు. "స్వామీ, మీరు నాకు దర్శనం ఇవ్వటమే చాలు. నాకు వరాలెందుకు ? ఐనా మీరు కోరుకోమన్నారు గనక కోరుకుంటున్నాను. చూడండీ, నా చెయ్యితీసుకెళ్ళి ఎవడి నెత్తిమీదపెడతానో వాడితల వెయ్యి వ్రక్కలై వాడు చచ్చిపోయేటట్లుగా నాకు వరం అనుగ్రహించండి!" అన్నాడు.

వాడికోర్కె వినేటప్పటికి శివునికి ఆశ్చర్యంవేసింది. "ఇదేమిటి వెఱ్ఱివాడు! ఇంతశ్రమపడి తపస్సుచేసి చివరికి నేను ప్రత్యక్షమై వరంకోరుకోమంటే ఇలాంటి వరమడిగాడేమిటి?" అనుకున్నాడు శివుడు. ఉండబట్టలేక, "ఇదేమిటోయ్, ఇలా కోరేవు!" అనికూడా అడిగిచూశాడు.

అందుకు వృకాసురుడు, "వరం అడగమన్నావు కనక అడిగేను. ఇవ్వటం ఇష్టం లేకపోతే, ఇవ్వలేనని చెప్పి పోరాదా?" అన్నాడు.

"నేను వరం ఇవ్వలేకపోవటమేమిటి? ఇచ్చాను పుచ్చుకో. నీఖర్మం ఎలాఉంటే అలా అవుతుంది" అనిచెప్పి, శివుడు వాడు కోరిన వరం ఇచ్చేసి, వెళ్ళిపోబోయాడు.






తక్షణమే వృకాసురుడు వెకిలినవ్వు నవ్వుతో, "ఏమయ్యోయ్ మహాదేవా, అగు. ఈ వరం నీ ఖర్మంకాలే ఇచ్చావు. నిన్ను ఏడిపించటానికే ఈ వరం కోరుకున్నాను. అగు. నాచెయ్యి మొదట నీనెత్తిమీదేపెట్టి, ఈ వరప్రభావం ఎలాంటిదో పరీక్షచేస్తాను" అంటూ శివుడిమీదికి దుమికేడు.

ఇది చూచి శివుడు హడిలిపోయాడు. అయన చటుక్కుని తప్పించుకున్నాడు గాని లేకపోతే వృకాసురుడిచెయ్యి అయన తలమీదపడి, నాశనమై పోవలసినవాడే!

"ఎంత కృతఘ్నుడు!" అనుకుంటూ శివుడు పరుగెత్తటం మొదలెట్టేడు. వృకాసురుడూ శివుడివెంట పడ్డాడు. మాంసపు కండలన్నీ కోసి ఇచ్చేయటంవల్లా, ఉపవాసాలుచేసి శుష్కించి ఉండటంవల్లా కొంత నీరసంగా ఉన్నాడుకాని లేకపోతే వృకాసురుడు శివుణ్ణి అందుకోగలిగేవాడే!

ముందు శివుడూ, వెనుక వృకాసురుడూ పరుగెత్తిపోతూండడం, ఆకాశంమీదనుంచి విష్ణులోకానికి వెడుతున్న నారదమహర్షి చూశాడు.

ఆయన తన దివ్యదృష్టివల్ల జరిగిన సంగతంతా తెలుసుకుని ఆశ్చర్యపోయాడు. "వీడికి తపస్సు చెయ్యవలసిందని ఆలోచన చెప్పింది నేనేకదా! కాని ఈ దుర్మార్గుడుతపస్సు ఇందుకోసం చేసేడన్న మాట! మంచివాళ్ళు పరోపకారంకోసం తమశక్తులు వినియోగిస్తే, దుర్మార్గులు తమ శక్తుల్ని ఇలా దుర్వినియోగం చేస్తారు!" అనుకుంటూ నారదుడు ఆపదలోఉన్న ఆ పరమశివుణ్ణి ఏదోవిధంగా రక్షించాలనుకున్నాడు.

పరమశివుణ్ణి రక్షించాలంటే మహావిష్ణువే ఏదో ఉపాయం చూపాలనుకుని నారదుడు తక్షణం వైకుంఠానికెళ్ళి విష్ణుమూర్తితో సంగతంతా చెప్పేశాడు.

విష్ణుమూర్తి లక్ష్మీదేవితో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్న సమయం అది. ఐతేనేం, నారదుడా సంగతి చెప్పటంతోనే చటుక్కుని లేచాడు. ఏమంటే తన తోటివాడు శివుడు. త్రిమూర్తులలోనూ ఒకడు. బ్రహ్మదేవునిచేత సృష్టిచేయబడ్డ ఈ లోకాలన్నీ విష్ణుమూర్తి కాపాడుతాడు. ఈ లోకాల పని ఐపోయాక, శివుడు వాటిని 'ఇంక పనికిరావు' అని నాశనం చేస్తాడు. ప్రళయకాలంలో లోకాలని ఇలా నాశనం చెయ్యవలసిన శివుడే ఇప్పుడు తలవని తలంపుగా ఒక కృతఘ్నుడిచేతిలో నాశనమైపోతే ఎలాగ? విష్ణుమూర్తి ఒక్క క్షణం కూడా అలస్యం చెయ్యకుండా బయల్దేరాడు. ఒక పొట్టి బడుగువేషం వేసుకుని, వృకాసురుడు శివుణ్ణి వెతుక్కుంటూ వెడుతూన్న చోటికొచ్చాడు.

ఆ కపట బ్రహ్మచారిని వృకాసురుడు చూచి, అయాసంచేత రొజుకుంటూ అగి, "ఏమబ్బాయ్, నీకు శివుడెక్కడైనా కనపడ్డాడా? పిరికిపంద! ప్రాణాలు అరిచేతిలో పట్టుకుపారిపోతున్నాడు!" అన్నాడు.

అందుకా బ్రాహ్మచారి, "శివుడా? కనపడ్డాడు. ఆ కొండమాటున ఎదురయాడు.



'ఎందుకయ్యా, ఎవరో తరుముకొచ్చినట్లు పరుగెత్తుతున్నావ్?' అని అడిగేనుకూడాను. అందుకు ఆయన 'నాభక్తుడు వృకుడు నన్ను ముట్టుకుంటానని తరుముకొస్తున్నాడు. కాస్త ముట్టుకుంటానంటే నాకేం పోయింది గనక? ముట్టుకోనిచ్చేవాణ్ణే. కాని వాడి వొళ్ళంతా మాంసపుకండలు కోసేసిన పుళ్లతోటి కంపుగొడుతో అసహ్యంగా ఉంది. ఆ పళ్ళాన్ని ముట్టుకుంటానని పట్టు పట్టకపోతే, దగ్గిరగా నది ఉందికదా, ఆ నదిలో కెళ్ళి శుభ్రంగా వొళ్ళంతా ఒకమాటు కడిగేసుకుని స్నానంచేసి శుచిగా రాకూడదూ? అలా వచ్చి ముట్టుకుంటానంటే నేమాత్రం

వద్దంటానా ?' అన్నాడు. ఔనుగాని, నీకు ఈమాత్రం తోచింది కాదేమిటోయ్ ? ఎంత లేదన్నా దేవుడాయిరిగదా శివుడు ? అతణ్ణి స్నానం చెయ్యకుండా ముట్టుకుంటారు టోయ్ " అన్నాడు బ్రహ్మచారి.

వృకాసురుడికా మాట వినేటప్పటికి, తాను నీళ్ళుపోసుకోకుండా శివుణ్ణి ముట్టు కుంటాననటం పొరబాటే అనిపించింది. 'ఇదేమిటి ? శాస్త్రాలూ, వేదాలూ, చదివిన నాకు ఈ మాత్రం తోచిందికాదేమిటి? ఏటికి వెళ్ళి స్నానంచేసి, సంధ్యవార్చి, సూర్యుని కర్ఘ్యం ఇచ్చి, శుచినైవస్తాను. అప్పుడు శివుడు తనంత తానేవచ్చి 'ముట్టుకోవోయ్' అంటాడు. గోళ్ళతో తీరిపోయేదానికి గొడ్డళ్ళు తేవటం ఎందుకు ?' అని ఆలోచించి, నదికివెళ్ళి, కంఠం లోతువరకూ దిగి, మునగటానికి ముందు జుట్టుముడి విప్పు కుందామని, చెయ్యి తలపైకి పోనిచ్చాడు.

ఇంకేముంది? శివుడా దుర్మార్గుడికిచ్చిన వరం ఇట్టే పనిచేసింది! తక్షణం వృకాసురుడి తల వెయ్యి వ్రక్కలై వాడు నాశనమైపోయాడు.

తానుచేసిన ఉపాయం ఫలించినందుకు విష్ణుమూర్తి సంతోషించి, ఈ సంగతేమీ తెలియక ఇంకా పరుగెడుతోనేఉన్న పరమ శివుణ్ణి కలుసుకుని "ఆగవయ్యా, ఇంక ఫరవాలేదు" అని, జరిగినదంతా చెప్పేడు.

శివుడంతావిని, "రక్షించావు బాబూ. నన్నేకాదు లోకాల నన్నిటినీ రక్షించావు. లేకపోతే ఈ దుర్మార్గుడు కనపడ్డవాడినల్లా నాశనం చేసేవాడే" అన్నాడు.

అందుకు విష్ణువు, 'నిజమే. కనుకనే నువ్వు దుర్మార్గులకి అలాంటి వరాలు వీలై నంతవరకూ ఇవ్వకుండా ఉండాలి' అని చెప్పి, శివుణ్ణి కైలాసానికి పంపేసి, తాను వైకుంఠానికి వెళ్ళిపోయాడు.



3




రాజకుమారి చెప్పినప్రకారం ధీర సింహుడు వెళ్లి, "నీ మూడవప్రశ్న ఏమిటి?" అని అడిగాడు.

అందుకు సులోచన "ఇక్కడికి దక్షిణ దిక్కున శతయోజనాల దూరంలో ఒక శ్మశానంలోనించి రాత్రిపూట 'అయ్యో! ఉపయోగమైన పని ఏదీ చేయకుండానే, ఈ శుక్రవారంకూడా గడచిపోయిందే!' అనే కేక వినిపిస్తుంది. ఆ కేక ఎందుకు వినబడుతున్నదో, దాని అంతరార్థం ఏమిటో వివరాలు చెప్పాలి" అన్నది.

సరేనని చెప్పి ధీరసింహుడు సులోచన వద్ద గడువు తీసికొని, దక్షిణదిశగా బయల్దేరాడు.

ఒక కాలిబాటన బయలుదేరి ఆతను చాలదూరం నడచినడచి అలసిపోయాడు. కాస్సేపు విశ్రమిద్దామని ఒకచోట కూర్చోబోయేటంతలో, సమీపంలోనే ఒక నగరం కనిపించింది. లేనిబలం తెచ్చిపెట్టుకొని, ధీరసింహుడు మెల్లగా ఆ నగరం చేరుకొన్నాడు.

నగరంలో అడుగు పెట్టీ పెట్టడంతోటే, ఇద్దరు సిపాయిలు వచ్చి, అతన్ని చుట్టుముట్టారు. వాళ్లు చూడగా, మనవంటి మనుష్యులూ కారు, రాక్షసులూ కారు. దేవలోకానికి చెందిన ఒక జాతివాళ్లలాగా కనపడ్డారు. "ఓయి భటుల్లారా! నేనేం తప్పు చేశానని నన్ను పట్టుకొంటారు? నా పనిమీద నేను వెళుతూ, ఈ నగరంమధ్య నించి పోవలసివచ్చింది. కనుక, నన్ను పోనీయండి" అంటూ ధీరసింహుడు ప్రాధేయపడ్డాడు. కాని, అతని మాటలను వాళ్లు చెవిని పెట్టకుండా, సరాసరి తమ ప్రభువువద్దకు తీసుకపోయారు.

దర్బారులో రాజు సింహాసనమందు కూర్చునివున్నాడు. రాజు ఏదో బాధ



వడుతున్నట్టు ధీరసింహుడు గమనించాడు. భటులను చూడగానే రాజు "ఈయన ఎవడోయ్? ఎందుకు వచ్చాడోయ్?" అంటూ విసుగుతో ప్రశ్నించాడు.

అందుకు భటులు "మహాప్రభూ! ఇతను మన నగరంలో అడుగుపెట్టిన పరాయిదేశస్థుడండి. మన దేశాచార ప్రకారం ఉరి తీయటానికని తీసుకవచ్చామండి" అని అనేవరకు, మహారాజు మాటాడకుండా తలవంచుకున్నాడు. ఇంతలో ధీరసింహుడు సంగతి సందర్భాలన్నీ ఒక్క నిమిషంలో గ్రహించి, "మహారాజా! తమ రేదో భరింపరాని బాధ అనుభవిస్తున్నట్టు కనబడుతున్నది. ఏలిక సెలవైతే, ఒక్క వారంరోజులలో ఈబాధ నేను నివారణ చేయగలను. అయితే, ఈ వారంరోజులూ నేను తమవెంబడే ఉండి, కొన్ని లక్షణాలను కనిపెట్టవలసివుంది. ఇందుకు అనుమతించినపక్షమందు ఇప్పుడే చికిత్స ప్రారంభిస్తాను" అన్నాడు.

రాజు బ్రహ్మనందభరితుడై, వెంటనే అంగీకరించాడు. యుక్తిపరుడైన ధీరసింహుడు, రెండు రోజులపాటు రాజు సమక్షమందే ఉండి ఆయన అలవాటులన్నీ గమనించాడు, కాని, రోగానికి కారణమేమిటో అంతుపట్టలేదు. మూడవరోజున అతనికి మెరపువలె ఒక ఆలోచన తట్టింది.

ఆరోజున, అందరితోపాటు రాజు భోజనంచేస్తూవుండగా, మధ్యలో ధీరసింహుడు 'పిడికిలి విప్పండి మహారాజా!' అన్నాడు. అలా విప్పగా, తన చేతిలో మెతుకులకు బదులు గులక రాళ్ళు ఉండటం చూచి రాజు ఆశ్చర్యపోయాడు.

అప్పుడు ధీరసింహుడు "మహారాజా! ఇప్పుడు తెలుసుకొన్నారా, ఇన్నాళ్లనించి మీరు అనుభవిస్తున్న బాధకు కారణం? బంతిని కూర్చున్నప్పుడు వడ్డనలో పక్షపాత

బుద్ధి పనికిరాదు. అది మహాపాపం. కావాలె నంటే మీరు ఏకాంతంగా కూర్చుని మీ యిష్టంవచ్చిన పదార్థాలు ఆరగింపవచ్చు. కాని, నలుగురిలో మీరుమాత్రం మంచి పదార్థాలు తిని, తక్కినవారికి చవుకరకం వస్తువులు వడ్డించడంతో, ఆ పాపం మీకు చుట్టుకొని, మీరు ఆరగించే దివ్యపదార్థాలన్నీ ఈవిధమైన రాళ్ళుగా మారిపోయి మిమ్మల్ని బాధిస్తున్నాయి. దృష్టాంతం చూడాలెనంటే, బంతిలో పక్షపాతం లేకుండా సర్వ సమానంగా వడ్డింపించినా సరే, లేదా మీరు ఒక్కరూ వేరే కూర్చుని భోజనం చేసినాసరే, మీకు ఈ పాపం అంటదు, ఈ బాధ ఉండదు" అని అనే వరకు, రాజు అలానే చేసి చూచాడు. ఇందువల్ల ధీరసింహుడు చెప్పినట్టుగానే రాజు బాధ నయమైపోయింది.

ఇహపరసాధకమైన ఈ సలహాకు రాజు చాలా సంతోషించి. ధీరసింహుణ్ణి తన ఆస్థానంలో ఉండిపోవలసిందని బతిమాలాడు, కాని, ఆతను వప్పుకోలేదు. 'పోనీ, మీకు కావలసిన వరం కోరుకుని, నన్ను సంతోషపెట్టండి' అంటూ రాజు ఆతనిని భక్తిపూర్వకంగా అడిగేవరకు, "ప్రభూ






మీరాజ్యంలో అడుగుపెట్టిన పరదేశస్థులను నిష్కారణంగా ఉరితీయుస్తూవుంటిరే! ఇది ఎంతటి దుష్టశాసనం! ఎంత అవివేకం! ఎంత అనాగరకం! ఇప్పుడైనా కన్ను తెరచి, ఈ దుర్నయం నిలిపివేస్తే అదే పదివేలు. ఇంతకుమించి నాకోసమై నేను కోరతగినది ఏమీలేదు" అని మనసువిడచి చెప్పేవరకు రాజు తన తప్పిదానికి సిగ్గు పడి, అర్థంలేని ఈ క్రూర శాసనాన్ని వెంటనే రద్దుచేయించాడు.

రాజులో కలిగిన ఈ మంచి మార్పులకు సంతోషించి, ధీరసింహుడు తనదారిన తను బయల్దేరాడు. ఆతను పాపం, రోజల్లా మిటమిటలాడే మండుటెండలో ప్రయాణం చేసి, నీరూ నిప్పూ పుట్టని ఒక గడ్డు ఎడారి పట్టి పోజొచ్చాడు. ఆ మహా ఎడారిలో హఠాత్తుగా భయంకరమైన ఇసుక తుపాను రేగింది. ఆ తుపానులో మిక్కుటమైన గాలికి ఎంతో దూరం కొట్టుకుపోయి, అతను దక్షిణదిక్కున ఒక చెట్టుకిందికి విసరబడ్డాడు.

అతను 'అమ్మయ్యో!' అని కాలూ చేయీ సర్దుకునేటంతలో, ఆ సమీపంనించే "అయ్యో! ఉపయోగమైన పని ఏదీ చేయకుండానే, ఈ శుక్రవారంకూడా గడచిపోయిందే!" అనే కేక వినిపించింది. విశ్రాంతిమాట తరువాత చూచుకోవచ్చునని తలచి, ధీరసింహుడు "ఓహో! ఈ కేక నేను తెలుసుకోవలసిన కేకలాగానే ఉన్నది. నేను చేరవలసిన ప్రదేశం ఇదే అయివుండాలి" అని నిశ్చయించి, తక్షణమే ఆ కేక వినబడిన దిక్కుకి కాలు సాగించాడు.

పోగా పోగా ఒక పెద్ద శ్మశానం, అందులో అనేకమైన గోరీలు కనబడినై.

అందులోని ఒక గోరీనించి ఆ కేక వినవచ్చిందని ధీరసింహుడు తన బుద్ధిబలం

వల్ల తెలుసుకోగలిగాడు. తన వుద్దేశం నిజమవునో కాదో నిర్ధారణ చేసుకోవటాని కని, ఒక గోరీ వెనుక చిత్రం చూస్తూ అలానే నిలబడ్డాడు.

ఇంతలో టంగ్ టంగ్‌మని పన్నెండు గంటలు కొట్టేవరకు, గోరీలమీద నున్న మూతలు తెరచుకొని, మృతగాత్మలందరూ ఇవతలకు వచ్చి నిలుచున్నారు. వారందరూ మంచి విలువైన వస్త్రాలు ధరించారు. వారివద్ద గుమగుమ పరిమళములు కొడుతున్నయి. వేషం చూడగా, వారు శ్రీమంతులని చెప్పకనే తెలిసిపోతున్నది. తరువాత వారందరూ బంతులు తీర్చి కూర్చున్నారు.

అయితే, ఇంతమందిలోనూ ఒక్కడు మాత్రం మురికిగానున్న చింపిపాతలు కట్టుకుని, గర్భ దరిద్రునిలాగా కనపడుతున్నాడు. ఇతన్ని చూచి ధీరసింహునికి జాలివేసింది. మృతగాత్మలందరూ తీర్చి కూర్చోగానే, పంచభక్ష్య పరమాన్నాలతో నిండిన బంగారు పళ్లాలు వాటంతట అవే ఒకొక్కళ్ల ఎదట ప్రత్యక్షమైనాయి.

వారందరకూ ఒకొక్క పళ్లెం సరిపడేటట్టు ఉండగా, పైన ఒక పళ్లెం మిగిలి







నీళ్లున్నై. అందరూ లొట్టలు వేసుకొంటూ హాయిగా భోజనాలు చేస్తూవుండగా, వాడు మాత్రం దేవుడా అంటూ కళ్లు నులుము కొంటూ కూర్చున్నాడు.

అప్పుడు ధీరసింహుడు పక్కనున్న వానితో "ఏమయ్యా! ఇదేమి న్యాయం! మన తోడివానికి బంతిలో పలపక్షం చేయటం ధర్మమేనా?" అని అడిగేసరికి "అయ్యా! అది దేవుని ఆజ్ఞ. దానిని తిప్ప టానికి ఎవరివల్లా కాదు" అని చెప్పాడు.

ఈ కీలక మేదో తెలుసుకోవాలనే పట్టు దలతో, అందరూ భోజనాలయి చేతులు కడుగుకునే సమయంలో ధీరసింహుడు గబగబ ఆ దరిద్రునివద్దకు వెళ్లి, "ఏమోయి నేస్తం! నీవు ఎవరవు? నీ దుస్థితికి కారణం యేమిటి?" అని అడిగేవరకు, అతను "అయ్యో! ఉపయోగమైన పని ఏదీ చేయకుండానే, ఈ శుక్రవారంకూడా గడచి పోయిందే!" అంటూ ఒక పెద్ద కేకపెట్టి, ఇలా చెప్పసాగాడు:—

"అయ్యా! ఇక్కడికి పదియోజనాల దూరంలో వున్న విశాననగరంలో నేనొక గొప్ప వ్యాపారస్థుణ్ణి. నేను బోలెడంత ధనం ఆర్జించి, కోట్లకు పడగలెత్తాను. కాని,

వున్నది. ఆ పళ్లెంవేపు చేయిచూపుతూ, ఆ మృతగాత్రులలోని ఒకవృద్ధుడు "ఓయి ధీరసింహుడా! ఈ పళ్లెం నీకోసమే ఏర్పాటు అయింది. కూర్చుని భోంచేయి" అన్నాడు.

సరేనంటూ, ధీరసింహుడు పళ్లెం ముందు కూర్చుని, ఒక్కసారి కలియ జూచాడు. అందరిముందూ పళ్లాలలో పంచభక్ష్య పరమాన్నములున్నై గాని, ఆ దరిద్రుని ముందున్న పళ్లెంలోమటుకి రాళ్లున్నై. అందరి లోటాలలోనూ రుచికర మైన తెల్లటి పాలుండగా, వాని లోటాలో మాత్రం కంపుకొడుతూ వున్న మురికి



ఎన్నడూ పిల్లికైనా బిచ్చంవేసిన పాపాన పోలేదు. ఇప్పుడు మీరు చూచినవాళ్లందరూ నా నౌకర్లు. వాళ్ల కష్టం తీసుకొని, జీతాలివ్వకుండా పీడించి, వాళ్ళను నానా తిప్పలు పెట్టాను. వాళ్లు కొద్ది ఆదాయం లోనే దానధర్మాలు చేసుకొని, పరమార్థ చింతతో జీవనం గడపటంచేత, ఈ లోకంలో వాళ్లు సౌఖ్యం అనుభవిస్తూ వున్నారు. నా పాపఫలం కొద్దీ నా నౌకర్ల ఎదటనే నేను నికృష్టజీవనం గడపవలసి వచ్చింది. నా పాపంవల్లనే నా కుమాళ్లు ముగ్గురూ, కోట్లకొద్దీ ధనం ఉండీకూడా, విడిశానగరంలో బిచ్చమెత్తుకోవలసిన గతి పట్టింది."

ఈ కథ వినగానే ధీరసింహుడు "మరైతే, నీవు ఆర్జించిన ధనమంతా ఏమయింది? నీ దుస్థితి తప్పించటానికి గత్యంతరం లేదా?" అని ఆత్రంతో ప్రశ్నించాడు.

అందుకు అతను "నీవు నాపట్ల అభిమాన ముంచి అడుగుతున్నావు గనక నిజం చెబు తున్నాను. నా ధనమంతా ఇంటి పెరడులో, తూర్పుదిక్కున ద్వారానికి సరిగా పది గజాల దూరంలో గొయ్యితీసి పాతిపెట్టాను. ఈ రహస్యం నా కుమాళ్లతో చెప్పకుండానే నేను చనిపోయాను. ఇప్పుడు ఏ పుణ్యాత్ము డైనా విడిశానగరం వెళ్లి, నేను ఆర్జించిన ఆ పాపపు ద్రవ్యాన్ని నాలుగు భాగాలు చేసి, అందులో మూడువంతులు ధర్మ కార్యాలకు వినియోగించి, తక్కినది నా కుమారులకు సమంగా పంచిపెట్టగలిగితే, నాకు ఉత్తరగతులు కలిగి, నేనూ నా నవుకర్లతోపాటు స్వర్గసౌఖ్యాలు అనుభ వించటానికి వీలవుతుంది" అని చెప్పాడు.

వెంటనే ధీరసింహుడు కష్టపడి విడిశా నగరం చేరుకొని, ఆ వ్యాపారస్థుని ఇల్లు కనుక్కొని, అతనికంటే మిక్కుటమైన

దరిద్రావస్థలో ఉన్న అతని కుమాళ్ళను కలుసుకొన్నాడు. 'నేను మీ నాయన వద్దనుంచి వచ్చాను' అని ధీరసింహుడు చెప్పగా, "ఇరవై ఏళ్ళకిందట చనిపోయిన మా నాయన ఏమిటి, నీకు కనబడట మేమిటి? విడ్డూరంగా వుందే!" అంటూ వాళ్లు పరిహాసంగా మాటాడారు.

అప్పుడు ధీరసింహుడు, వారి తండ్రి చెప్పిన సంగతులూ, ఆనవాళ్లూ చెప్పి, వారిని పెరట్లోకి తీసుకొని వెళ్లి వెతకి చూడగా, ధనం కంటబడేవరకు వాళ్ళు అతని మాటలు నిజమేనని నమ్మారు. తరువాత ధీరసింహుడు వర్తకుడు చెప్పిన ప్రకారం మూడువంతుల ధనం ధర్మ కార్యాలకు వినియోగించి, మిగిలింది వర్తకుని ముగ్గురు కుమాళ్లకూ సమంగా పంచిపెట్టాడు.

ఆ క్షణంనించీ ఆ కుమారులు ముగ్గురూ దరిద్రం పోయి, హాయిగా జీవిస్తున్నారు.

ధీరసింహుడు తిరిగి శ్మశానానికిపోయి చూచేవరకు, వర్తకుడు ఇప్పుడు తక్కిన మృతగాత్మలందరితో పాటు సుఖంగా జీవనం గడుపుతున్నాడు. అతను ధీరసింహుణ్ణి చూడగానే, తనకు జరిగిన ఉపకారానికి ఎంతో సంతోషం తెలుపుతూ, అతన్ని దీవించాడు.

ధీరసింహుడు ఆ వర్తకునివద్ద సెలవు తీసుకొని, తిరుగా కౌశాంబీ నగరం చేరుకొన్నాడు.

సులోచన అతన్ని గౌరవించి కూర్చోబెట్టి, అతను చెప్పినదంతా శ్రద్ధతో విన్నది. చివరకు, "నీవు చెప్పింది నిజమే. ఈ శుక్రవారంనాడు ఆ కేక వినబడటంలేదు కూడాను. నీ తెలివితేటలకూ ధైర్యసాహసాలకూ సంతోషించాను. రేపు వచ్చి, నాలుగో ప్రశ్న తెలుసుకుందువుగాని" అంటూ ఆమె ధీరసింహుణ్ణి సాగనంపింది. [ఇంకా వుంది]






ఒకానొకప్పుడు చోళప్రభువులు తంజావూరు రాజ్యాన్ని పరిపాలించేవారు. వారిలో ఒకడు మనునీతిచోళుడు. ఆయన పాలనలో ధర్మం నాలుగుపాదాల నడిచేది. మనుష్యులకే కాకుండా, నోరులేని జంతువులకుకూడా ఆయన రాజ్యంలో న్యాయం దొరికేది.

ఇటువంటి కీర్తి గడించిన మనువుకు లేకలేక ఒక్కగానొక్క కుమారుడు కలిగాడు. వానికి విధివిడంగుడు అని పే... పెట్టి అల్లారుముద్దుగా పెంచుకొ... విధివిడంగుడు మంచి బుద్ధి... తండ్రివలెనే అతనుకూడా జీవకారుణ్యం ముఖ్యమైన ఆదర్శంగా పెట్టుకున్నాడు.

ఇలా ఉండగా, ఒకరోజున విధివిడంగుడు దేవదర్శనానికి వెళ్లవలెనని తన రథంలో బయల్దేరాడు. రథం వెళ్ళుతూవుండగా, దురదృష్టవశాన, ఒక చిన్నారి ఆవు దూడ గెంతుకొంటూ వచ్చి ఆ రథ చక్రాలక్రింద పడి వెంటనే చనిపోయింది.

ఆవుదూడ అవస్థ కనులార చూడగానే, విధివిడంగుడు కొయ్యబారిపోయాడు. నోట మాట రాలేదు. కొంతసేపటికి ఆతను తేరుకొని, "అయ్యో, పరమేశ్వరా! నీ దర్శనం చేసుకొందామని బయల్దేరడమేమిటి, ఇటువంటి ఘోరపాపానికి ఒడికట్టుకోవలసి రావడమేమిటి? ఈ వార్త చెవినిపడితే, ...ణానిధి అయినటువంటి నా తండ్రి ...డు! అందులోనూ, తన కొడుకే ...ష్టకార్యం చేశాడని విని, అయన ఎంత దుఃఖిస్తాడో! ఛ! నా తండ్రిపేరు, రూపుమాపటానికి నేను చెడపుట్టాను. పాపం, ఈ చిన్నారి దూడను కన్న ఆ గోమాత ఎక్కడెక్కడ వెతుకులాడుతున్నదో! చచ్చిన ఈ లేగ కంటపడగానే అది ఎంతగా విలపించి గోలపెడుతుందో

ఆర్. కౌసల్య, కర్నూలు



కదా! ఊహుఁ!! దాని దుఃఖం నేను ఈ కన్నులతో చూడలేను. మళ్ళీ పోయి, నాతండ్రికి ముఖం చూపలేను. ఆయనకు ఈ వార్త తెలియకముందే నేను ప్రాణాలు విడిచేస్తాను. ఇదే కర్తవ్యం," అంటూ విధివిడంగుడు కుమిలిపోయాడు.

అక్కడ ఉన్నవాళ్లందరూ అతనిని ఓదార్చసాగారు. ఇంతలో ఆవు 'అంబా! అంబా!!' అని తన లేగకోసం అరుచుకొంటూ, పరుగెత్తుకొని రథం దగ్గరకు వచ్చింది. అది పడిన దుఃఖం, ఆవేదన చూచిన ప్రతివాళ్ళకూ కన్నులవెంట జలజల నీటిచుక్కలు రాలినై.



ఆ ఆవు అట్టేసేపు అక్కడ ఆగలేదు. అది సరాసరి రాజుగారికోటకు చేరుకొని, న్యాయగంటకు కట్టివుండే తాడు నోటితోపట్టి లాగేవరకు గంట గణగణ మ్రోగింది. రాజు ఆత్రంతో గబగబ భవనం దిగివచ్చి కన్నీరు కార్చుతూ దుఃఖసముద్రంలో మునిగివున్న ఆ ఆవును చూచి ఆశ్చర్యపోయాడు.

నోరులేని ఈ ఆవుకు ఏమి విపత్తు సంభవించివుంటుందా అని వివరాలు కనుక్కొనేటప్పటికి, నిజంతెలిసి, ఆయన తక్షణమే మూర్ఛపోయాడు. ప్రియమైన తన కుమారుడే ఈ పాపపు పని చేశాడని విన్నప్పుడు, ఆయన విచారానికి అంతులేకపోయింది.

చాలసేపటికి ప్రభువుకు స్మృతివచ్చింది. తరువాత ఆయన న్యాయం బాగా ఆలోచించి, మంత్రితో "ప్రాణానికి బదులు మళ్లీ ప్రాణం యివ్వటమే ధర్మం అని శాస్త్రాలు చెబుతున్నాయి కనుక, ఏ రథంక్రిందనైతే ఆ ఆవు దూడ పడి చచ్చిపోయిందో, ఆ రథచక్రాలనే శరీరంపైన దొర్లించి, నా కుమారుని ప్రాణం తీయించవలిసింది" అని ఆజ్ఞాపించాడు.

రాజు చేసిన ఈ ఉత్తరవు వినగానే మంత్రి గుండె నీరైపోయింది. కాని






ప్రభువు ఆజ్ఞకు ఎదురుచెప్పటానికి వీలు లేదు కదా? రాజకుమారుని చంపించటానికి మనస్సు ఒప్పక, చేసేదిలేక, రెండవకంటివానికి తెలియకుండా మంత్రి ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఈ సంగతి రాజుకు తెలిసి, తనే రథం మీద అవుదూడ చచ్చిన ప్రదేశానికి వెళ్లి, తను చెప్పిన తీర్పు ప్రకారం, కుమారుని పైన రథచక్రాలు దొర్లేటట్టు ఏర్పాటుచేసి, వానిని చంపించి వేశాడు.

"నాకు కుడిభుజంగా వున్న మంత్రి పోయాడు. లేకలేక పుట్టిన నా కుమారుడు పోయాడు. ఇక, ఇదివరకులాగా రాజ్య పాలన జరపటం నావల్ల అయే పనికాదు. కనుక నేను బ్రతికిమాత్రం ఏమిలాభం." అనుకుంటూ రాజు కళ్లుమూసుకొని దేవుని ధ్యానించి, కత్తితో పొడుచుకుని చనిపో బోయాడు. అప్పుడు ఒక చిత్రం జరిగింది.

"మహారాజా! నీవు ఆత్మహత్య చేసుకోవటానికి వీల్లేదు. నీవు ధర్మప్రభువువనీ, నీ రాజ్యంలో ధర్మం నాలుగుపాదాలా నడుస్తున్నదనీ, మానవులకూ, నోరులేని మూగ జీవాలకూ ఒకేవిధమైన న్యాయం దొరుకుతుందనీ కీర్తికాంత చెప్పగా విని, నిన్ను పరీక్షింపవచ్చిన ధర్మదేవతను నేను. నీవు పరీక్షకు నిలిచావు, సంతోషమైంది. ఈ పరీక్షవల్ల నీకీర్తి ఇంకా ఎక్కువగా వ్యాపించబోతున్నది. నీవు ఇదేవిధంగా రాజ్యంలో ధర్మం నిలిపి, ప్రజలకు శాంతి సౌఖ్యాలు కూర్చవలసింది" అంటూ, ఒక అశరీరవాక్కు వినిపించింది.

రాజు ఆశ్చర్యభరితుడై కన్నులు విప్పేసరికల్లా, ప్రాణసమానుడైన తన కుమారుడు, మంత్రికూడ బ్రతికివచ్చారు. రథంక్రింద పడిన అవుదూడకూడా ధర్మ దేవత అనుగ్రహం వల్ల బ్రతికి, తల్లికి ఆనందం కలిగించింది.




పూర్వకాలమందు కల్యాణపురమనే గ్రామం ఉండేది. ఆ గ్రామం ఒక కొండపైన కట్టబడింది. కొండదిగువను అందమైన కొలను ఉన్నది. ఆ కొలనుదగ్గర రేబాలుడనే పిల్లవాడూ, అతని తల్లీ నివసిస్తూ ఉండేవారు. వీళ్లుతప్ప, ఆ కొలనుదగ్గర మరెవరూ ఉండేవారు కారు.

రేబాలుడు కల్యాణపురంలో ఉండే గ్రామస్థుల పశువులను కొలనువద్దకు తీసుకవచ్చి, మేపుతూ ఉండేవాడు.

ఒకరోజున రేబాలునికి ఒకచిత్రం కంటపడింది. రాకసరూపాలతో కొన్ని ఎద్దులు కొండపైన మైదానంలోకి ఎక్కిపోతున్నాయి. ఆ వింతఎద్దులను ఒక హంస తోలుతున్నది. అతను అలా చూస్తూవుండగానే అహంస ఒకచక్కనికన్యగా మారిపోయింది!

ఆమె రేబాలునివద్దకు వచ్చి, అతని చేతిలో ఒక రొట్టెముక్క పెట్టి, "దీనిని తీసుకొని తినవలసింది" అని చెప్పి, అదృశ్యమైపోయింది. మరుక్షణంలో ఆ వింత ఎద్దులుకూడా మాయమైపోయినయి.

ఇంటికిపోయి, ఈ చిత్రాలన్నీ రేబాలుడు తల్లితో పూసగుచ్చినట్టు చెప్పి, ఎలాగైనా ఆ కన్యను పెళ్లి చేసుకుంటానని పట్టుబట్టాడు.

ఇదిచూచి అతని తల్లి—"అబ్బీ, ఆ కన్య ఎవరోకూడా మనకు తెలియదాయె. అయినా, యిలాంటి వింతలు చెయ్యగల ఆ పిల్ల ఎవరో దేవకన్య అయివుంటుంది కాని మానవకన్య కాదు. ఆ పిల్లకు నీకూ పెళ్లి ఎలా కుదురుతుంది? నామాట విని ఆ ఆలోచన మానుకో" అని నచ్చజెప్పింది.

తల్లి ఎంత బోధించినా, రేబాలునికి ఆమె మాటలు రుచించలేదు. అతను అదే పనిగా ఆమెకోసం నిరీక్షిస్తువున్నాడు.

ఇలా వుండగా—ఒక పున్నమిరోజున కొండ ఒడ్డునించి కొలనులో ఏవో తనవేపు

టి. వి. రమణమూర్తి, పాలకొల్లు

కొట్టుకువస్తూవున్నట్టు రేబాలునికి కనపడింది. చేరువకు రాగానే అది ఒక రొట్టెముక్క అని రేబాలుడు గ్రహించాడు. దానిని చూడగానే అతనికి ఆ కన్య గుర్తుకి వచ్చి, ఆ రొట్టెముక్కను తినివేశాడు.

రేబాలుడు రొట్టెముక్క తిన్నవెంటనే, కొలనులో శబ్దం పుట్టింది. ఆశబ్దం ఏమిటా అని చూచేవరకు అవి మునుపు అతను చూచిన వింత ఎద్దులే! ఎద్దుల వెనుక ఒక బంగారపు చిన్నిపడవ కనపడింది. పడవ ఒడ్డుకి రాగానే, అందులోనించి తను ప్రేమించిన సరోవరకన్య దిగివచ్చింది.

అప్పుడు రేబాలుడు తన మనసులో కోరిక ఆమెతో చెప్పేవరకు, ఆమె "రేబాలుడా! నిన్ను పెళ్లి చేసుకోవడం నాకు సమ్మతమే. ఐతే, నీవు మానవుడవు, నేను దేవకన్యను. కాని, ఒక షరతుకు ఒప్పుకొన్నట్టయితే నీకోరిక నెరవేరుస్తాను'' అన్నది.

రేబాలుడు "సుందరీ! నీవు ఎటువంటి కఠినమైన షరతు పెట్టినాసరే నాకు అంగీకారమే. అవేమిటో చెప్పు" అన్నాడు.

"పెళ్లి అయిన తరువాతకూడా నీవు నాపైన ఇంతటి మక్కువతోనూ ఉండాలి




సుమా. ఎప్పుడైనా నన్ను ఉదాసీనంతో చూచి కోపగించుకొన్నపక్షమందు, మూడు తడవలవరకూ ఊరుకుంటాను. మూడవ సారి నీ కంటికి అగపడకుండా పోతాను. ఇదే షరతు'' అని సరోవరకన్య అన్నది.

'అలా ఎన్నడూ జరగదు' అని రేబాలుడు ఆమె పెట్టిన షరతుకు ఒప్పుకున్నాడు.

తన షరతుకు రేబాలుడు ఒప్పుకోగానే ఆమె మానవరూపం ధరించి గాంధర్వ విధానంతో అతనిని అక్కడే పెళ్లిచేసుకొంది. తర్వాత రేబాలుడు ఆమెతోసహా యింటికి తిరిగివచ్చాడు. రేబాలుని తల్లి కూడా చాల సంతోషించింది.





ఎక్కువగా వున్నది. రేబాలునికి పొలంపని మీద దృష్టిపోయింది. కనుక, 'మరో కప్పుడు రావచ్చు, పోదాం' అన్నాడు.

'అదేం మాట, దర్శనం చేసికొనకుండా పోవడమా?' అన్నది అతని భార్య.

'వస్తే రా, లేకుంటే ఇక్కడనే ఉండిపో' అంటూ అతను కోపగించాడు.

అప్పుడు ఆమె, భర్తకు పెళ్లినాటిమాట జ్ఞాపకంచేసి, 'షరతు తప్పడం ఇది మొదటిసారి' అని అతనిని హెచ్చరించింది.

రేబాలుడు తన పొరపాటు ఒప్పుకొనక తప్పిందికాదు.

కొంతకాలం హాయిగా గడచి పోయింది. ఇంతలో రేబాలుని పొరుగున వుండే ఒక స్నేహితుడు చనిపోవడంచేత, ఆ యింటికి వారు పరామర్శకు పోవలసి వచ్చింది. అక్కడికి వచ్చినవారందరూ విచారంలో మునిగివుండడంచూచి సరోవర కన్య పకపక నవ్వడం మొదలెట్టింది. తనలో దేవత్వం ఉండటంచేత ఆ చని పోయినవాని నిజస్థితి ఆమె ఒక్కతెకు మాత్రమే గోచరించింది. ఆ చనిపోయిన వాడు ఇప్పటివరకు ఎన్నో బాధలు పడి, మరణించిన తరువాత స్వర్గానికిపోయి

సరోవరకన్యకు కోకొల్లలుగా పశుధన మున్నది. ఆమెకు ఆ కొండమీద ఎన్నో గోభూములున్నాయి. పెళ్లి కావడంతోనే తన పశువులన్నిటినీ ఆమె భూలోకానికి తోలుకువచ్చింది. వీటిని రేబాలుడు కొండ పైకి తీసుకుపోయి మేపుతూ ఉండేవాడు.

కొద్దికాలానికే వారికి లక్షణమైన కొడుకులూ, అందమైన కుమార్తెలూ పుట్టారు. అంతా హాయిగా వుంటున్నారు.

* * *

ఇలావుండగా ఒకనాడు, వారు దేవ దర్శనంకోసమని గుడిలోకి వెళ్ళారు. ఆ రోజు పర్వదినం కావడంచేత జనసమ్మర్దం








సుఖంగా వున్నాడు. 'సుఖంగా ఉన్న ప్రాణిని చూచి ఈ అమాయకులందరూ ఎందుకు ఇలా దుఃఖిస్తారా' అని ఆమెకు నవ్వువచ్చింది. ఇదిచూచి రేబాలుడు, తన భార్యపెట్టిన షరతు మరచి, "పిల్లవాడు చచ్చి వాళ్లు ఏడుస్తుంటే నీకు నవ్వుగా వుందా?" అని ఆమెపై కోపగించాడు.

అప్పుడు సరోవరకన్య అతనితో 'రెండవ సారి షరతు తప్పిపోయావు. జ్ఞాపక ముంచుకో' అని హెచ్చరించింది.

అతను జరిగినదానికి విచారించి, ఇక ముందు జాగర్తగా నడచుకొంటానని తన నిశ్చయాన్ని తెలిపాడు. ఈమాట అన్నాడే కాని, అతను సంసార సౌఖ్యంలోపడి, ఈ గొడవే మరచిపోయాడు.

* * *

కొన్నాళ్ళు పోయినతరువాత ఒకరోజున వారు ఒక పెళ్ళికి వెళ్ళవలసివచ్చింది. పెళ్లికివచ్చిన అందరూ ఎంతో సంతోషంగా ఉన్నారు. దేవతాహంశ కలది గనుక, సరోవరకన్యకు మాత్రం ఈ పెళ్లి అవుతున్న వధువూ, వరుడూ త్వరలోనే కష్టాలలో మునిగిపోతారనే రహస్యం తెలుసు. అందుచేత ఆమె, వారిదుస్థితిని తలచుకొని, ఎడతెగని విచారంతో ఏడుస్తూ కూర్చుంది. రేబాలుడువచ్చి ఊరడించబోయాడు. కాని ఆమె దుఃఖం తగ్గలేదు. చివరకు అతనికి విసుగెత్తి "ఛీ! శుభమాఅని వాళ్లు పెళ్లిచేసుకొంటూ వుంటే, అర్థంలేని ఈ యేడుపేమిటి?" అని కోపగించుకొన్నాడు.

అప్పుడామె భర్తతో "ఇది మూడోసారి నువ్వు నాపైన కోపగించుకోవటం. నేను పెట్టిన షరతు తప్పావు కనుక నేను వదిలి పోతున్నాను" అనిచెప్పి తక్షణమే ఆమె తన పూర్వపు రూపాన్నిపొంది ఒక్కసారిగా మాయమైంది. ఆమెను ఎలాగైనా పట్టవలెననే ఆశతో రేబాలుడు కొలనువద్దకు

ఆత్రంతో పరుగెత్తాడు. ఆమె కనపడలేదు. సూర్యుడు అస్తమించేవరకు అతనలా కనిపెట్టుకొనివున్నా ఆమెజాడ తెలియనేలేదు.

* * *

నెలలు గడచినై, సంవత్సరాలు గడచినై. ఎంతకాలమో రేబాలుడూ, అతని కొడుకులూ కూతుళ్లూ ఆ కొలనువద్ద విచారముతో రాత్రింబగళ్లు నిరీక్షిస్తూ కూర్చున్నారు.

ఆ పిల్లలకు ఒకరాత్రి సరోవరకన్య తన నిజరూపంతో కనుపించింది.

ప్రేమతో ఆమె తన బిడ్డలను చేర దీసుకొని, దీవించింది. కుమార్తెలతో "అమ్మలూ! మీరు మన పశువులను కొండమీదికి తోలుకుపోయి మేపుతూ, నాయనగారికి సాయపడండి" అని హితవు చెప్పింది. కుమారు లిద్దరనూ పిలిచి "నాయనా! నా కడుపున పుట్టిన మీరు ప్రయోజకులై శాశ్వతమైన కీర్తినిగడించాలి. మీరు మానవుల వ్యాధులను కుదర్చటానికి నడుము కట్టండి. మీరు కొలనువద్దనున్న కొండ ఎక్కి, నన్ను తలచుకొన్నట్టయితే, నేను అదృశ్యరూపంతో మీవద్దకు వచ్చి, మహిమగల మూలికలన్నీ ఆనవాలు చూపిస్తాను. నాదీవనవల్ల మీకు వైద్యశాస్త్రం సహజసిద్ధంగా అబ్బిపోతుంది. ఆ శాస్త్ర ప్రకారం మీరు కనిపెట్టిన మూలికలను ప్రయోగించితే ఎంత ప్రమాదమైన జబ్బు అయినా యిట్టే నయమవుతుంది. పంచ భూతములు ఉన్నంతకాలమూ మీపేరు శాశ్వతంగా నిలిచి పోతుంది" అని చెప్పి అంతర్ధానమై పోయింది.

వారు ఈ వింతలన్నీ తండ్రికి వినిపించే వరకు, ఆతనుకూడ చాల సంతోషించాడు.

మరునాటినించీ పిల్లవాళ్ళు ఇద్దరూ కొండపైకిపోయి, తల్లి చలువవలన అమోఘమైన మూలికలు సేకరించుకవచ్చి, మానవ సేవ చేయడం ప్రారంభించారు.






పంచపాండవులలో మొదటివాడైన ధర్మరాజు 'అశ్వమేధయాగం' అనే గొప్ప యజ్ఞం ఒకటి చేశాడు. ఆ యజ్ఞం జరిగి నన్నాళ్లు ఆయన గొప్ప సంతర్పణలు చేయించాడు. ఎక్కడెక్కడ ఉన్న బ్రాహ్మలూ, ఋషులూ, మునులూ, సాధులూ, సన్న్యాసులూ, భిక్షువులూ వచ్చి పంచభక్ష్య పరమాన్నాలతో భోంచేసి వెళ్లేవారు. ధర్మరాజు వాళ్లందరికీ బంగారపు పాత్రలలో భోజనం పెట్టించి, వాళ్లు వెళ్లేటప్పుడు ఆ పాత్రలనుకూడా బహుమానంకింద పట్టుకు పొమ్మనేవాడు. ఆయన అన్నదానానికీ దాతృత్వానికీ, వచ్చినవాళ్ళంతా అనేక విధాల మెచ్చుకున్నారు. ఆ స్తోత్రాలు చెవినిపడ్డ ధర్మరాజు సంతోషంతో ఉబ్బి పోయాడు. ఆతర్వాత అతిథులలో ఒక్కొక్కడికీ రెండేసీ మూడేసీ బంగారపు గిన్నెలు ఇచ్చేయటం మొదలెట్టేడు.

దగ్గిర ఉండి యజ్ఞం అంతా నడిపిస్తున్న శ్రీకృష్ణుడికి, "ఏమిటి చెప్మా. ధర్మరాజు యిలా వొళ్లు తెలియకుండా ఖర్చుపెడు తున్నాడు?" అనిపించింది. "ఏమిటి బావా, చాలాజోరుగా దానాలిచ్చేస్తున్నావ్?" అని అడిగేశాడు కూడాను.

అప్పుడు ధర్మరాజు దర్జాగా, "జోరు గాక మనకేమిటోయ్? వచ్చినవాళ్లు మనల్నిగురించి ఎలా చెప్పుకుంటున్నారో వినపట్టంలేదూ? 'ధర్మరాజువంటి అన్నదాత ఇదివరలో లేడు; ఇక ముందు పుట్టబోడు!' అనుకుంటున్నారు." అన్నాడు.

శ్రీకృష్ణుడు ఏదో చెప్పబోయాడు గాని ధర్మరాజు వినిపించుకోలేదు. ఎందుకు వినిపించుకుంటాడు? 'మహాన్నదాత నైపోయాను!' అనే అహంభావం అతన్ని కమ్ముకుపోయింది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



శ్రీకృష్ణుడు తన భక్తులన్నా, బంధువులన్నా, మిత్రులన్నా ఎక్కువ ప్రేమ చూపుతాడు. కాని వాళ్ళలో ఏమాత్రం గర్వం బయల్దేరినా ఆయన సహించడు. ఆ గర్వాన్ని భంగపరుస్తేగాని ఆయనకు నిద్రపట్టదు. మహాన్నదాత ననుకుంటున్న ధర్మరాజుకి గర్వభంగం చెయ్యాలని ఆలోచించి, అతణ్ణి భోజనశాల కవతల అతిథులు చేతులు కడుక్కునే చోటికి తీసుకెళ్ళేడు. కోట్లకొలది అతిథులు భోంచేసి అక్కడ చేతులు కడుక్కుంటూండడం వల్ల, ఆ నీరంతా ఓ నదిలా ప్రవహించటం మొదలెట్టింది.

ధర్మరాజు శ్రీకృష్ణుడితో "బావా చూశావా, ఈ నదిని?" అన్నాడు.

అందుకు కృష్ణుడు, "నదికేంగాని ఆ బురదలో అటూ ఇటూ దొర్లుతూ ఓ ముంగిస ఉంది చూశావా?" అన్నాడు.

"ఆ చూశాను. బురదలోంచి ఇవతల కొచ్చి నిలబడి, తన ఎడంవైపు చూసుకుంటోంది. అదిగో మళ్ళీ బురదలోకెళ్ళి దొర్లుతోంది చూడు." అన్నాడు ధర్మరాజు.

ఆ ముంగి మళ్ళీ బయటకొచ్చేసింది. ఇదిచూచి ధర్మరాజు, "ఇందాకట్లాగే తన ఎడంవైపు చూసుకుంటోంది. ఎందుకు చెప్మా, బురదలో దొర్లి వచ్చి అలా చూసుకుంటోంది?" అని కృష్ణుణ్ణి అడిగాడు.

కృష్ణుడు జవాబు చెప్పేలోగా ఆ ముంగి ధర్మరాజు ఎదటికివచ్చి మనిషికి మల్లే మాట్లాడడం మొదలెట్టింది.

"మహారాజా, విను. కొన్ని సంవత్సరాలకు పూర్వం ఇక్కడకు కొన్ని యోజనాల దూరంలో సక్తుప్రస్థుడనే పేద బ్రాహ్మ డొకడుండేవాడు. ఆయన పూరి గుడిసె పక్కన ఓ అతిథి చెయ్యి కడుక్కున్నచోట బురదలో దొర్లుతే నా కుడిపక్క బంగారమైంది. నా ఎడంపక్క





గూడా బంగారం చేసుకోవాలన్న ఆశతో దొర్లపొతే అక్కడ చాలినంత బురదలేక, ఆపక్క మామూలుగానే ఉండిపోయింది" అన్నది ముంగి.

ధర్మరాజు ఆశ్చర్యపోయాడు. "బురదలో దొర్లుతే వొళ్లు బంగార మౌతుందా ఎక్కడన్నా?" అన్నాడు.

"మీకు సందేహంగా ఉంటే చూడండి మహారాజా" అంటూ ముంగిస ఆ నీళ్ళల్లోకి పరుగెత్తి వెళ్లి తన వంటి బురద కడిగేసు కొచ్చి, ధర్మరాజుకి తన కుడివైపు చూపించింది.

"నిజమే. ఈవైపు అంతా బంగారమే! ఇదెలా సాధ్యమైంది?" అని ఆశ్చర్యంగా అడిగాడు ధర్మరాజు.

"సక్తుప్రస్థుడు మహాన్నదాత. అందు వల్లనే ఆయన గుడిసెవద్ద అతిథి చేతులు కడుక్కున్న నీటికి ఆ మహిమ కలిగింది." అన్నది ముంగి.

"నాకంటే ఎక్కువ అన్నదాతా, ఆ పేదబ్రాహ్మడు? ఇక్కడ చేతులు కడుక్కున్ననీరు ఏత్తైపారుతోంది. సక్తు ప్రస్థుడి పర్ణశాల పక్క బురద నీ కుడి పక్కకు మాత్రమే సరిపోయి, ఎడమ పక్కకు లేకపోయిందన్నావు!" అన్నాడు ధర్మరాజు.

"నిజమే; కాని ఆ కాస్త బురదా అంటితేనే నాకు ఒకపక్క బంగారమైంది, నీవు చాలా గొప్పగా అన్నదానం చేస్తున్నా వని విని ఇక్కడకువచ్చి ప్రొద్దుటినుంచీ ఈబురదలో దొర్లుతూ శ్రమపడుతున్నాను. కాని ఒక్క పెసరగింజంత మేర ఐనా నా ఎడం పక్కని బంగారమవలేదు. సక్తు ప్రస్థుడు పూటకు తికాణాలేని పేదవాడే గాని ఆయన అన్నదానం ముందు నీ సంతర్పణ ఏ లెక్కకీ రాదని తేలిపోయింది." అన్నది ముంగి.



ఆ ముంగి ఇలా ధర్మరాజుతో చెప్పేసి తనదారిని వెళ్ళిపోయింది. ధర్మరాజు సిగ్గుతో కుమిలిపోయాడు. శ్రీకృష్ణుడు తానేమీ యెరగనట్లు దిక్కులు మాడడం మొదలెట్టేడు. ధర్మరాజాయనతో, "బావా, ఈ సక్తుప్రస్థుడు ఎవరు?" అని అడిగేడు.

అప్పుడు కృష్ణుడు సక్తుప్రస్థునిగురించి ఇలా చెప్పసాగాడు.

"ఆ ముంగి చెప్పిందిగా అతడొక పేద బ్రాహ్మడని? పేదవాళ్ళల్లోకల్లా పేదవాడతను. ఐతేం? అతనూ, అతని కుటుంబం కూడా 'దేహి' అని ఒకళ్ళని యాచించకుండానే జీవితం గడిపేరు. అతనూ, అతని భార్యా, కొడుకూ, కోడలూ ఈ నలుగురూకూడా పొలాలలో రాలి పడ్డ ధాన్యం యేరి తెచ్చుకుని దంచి బియ్యం చేసి, ఆ బియ్యంతో పొట్టపోసుకునేవారు. ఆ అన్నమే కొంత అతిధులకు పెట్టి మిగిలినది తాము తినేవారు.

"ఇలా రోజులు గడిచిపోతూంటే ఉన్నట్టుండి కరువొచ్చింది. పేదవాళ్ళ సంఖ్య ఎక్కువై, పొలాలలో రాలిన గింజలు యేరుకుపోయేవాళ్ళు యెక్కువయ్యారు. అంచేత సక్తుప్రస్థుని కుటుంబానికి చాలా ఇబ్బంది వచ్చింది. వాళ్ళు నలుగురూ వెళ్ళి వరుసగా నాలుగురోజులు ఏరితెస్తే తప్ప ఒకపూటకు సరిపడే గింజలు దొరికేవి గావు. అంచేత నాలుగేసి రోజులకోమాటు భోజనంచేసి, తక్కిన రోజులలో పస్తులుండేవారు.

"ఇలా ఓమాటు నాలుగు రోజులూ ఉపవాసాలుండి కూడబెట్టుకున్న బియ్యాన్ని వండి, ఆ అన్నం నాలుగు వాటాలు చేసుకుని విస్తళ్ళలో వడ్డించుకుని తిందామనుకుంటూంటే ఎక్కడనుంచి వచ్చాడో ఓ అతిధి వచ్చాడు. మరెవరైనా ఐతే ఆసందర్భంలో, 'అయ్యా, నాలుగు

రోజులనుంచి మాకు తిండిలేదు. ఇప్పుడు వండుకున్నది మాకు పూర్తిగా కడుపు నిండదు. కనుక మరోచోట చూసుకోండి' అని నిర్మొగమాటంగా చెప్పేద్దురు. కాని సక్తుప్రస్థు డలాచెయ్యలేదు. విస్తరిముందు కూచున్నవాడు దభీమని లేచి, ఆ వచ్చిన వృద్ధుని పాదాలుకడిగి ఆ నీళ్ళు నెత్తిమీద చల్లుకుని, ఆయనను తన విస్తరిముందు కూచోబెట్టి 'ఆరగించండి బాబూ' అని అన్నాడు.




"ఆ అతిధి, 'ఈ కాస్తా నేను తినేస్తే నీమాట యేమిటి?' అనకుండా ఒక్క మెతుకైనా మిగలకుండా విస్తట్లో అన్నం అంతా తినేశాడు. పోనీ అంతా తినేసి లేచాడా? అదీ లేదు. పైగా 'నాకేం కడుపు నిండలేదు' అన్నాడు.

"అతిధి అర్ధాకలితో లేవకూడదు అని సక్తుప్రస్థుడు బాధపడ్డాడు. 'ఎందుకూ, నావాటా వడ్డిస్తాను' అని ఆయన భార్య తన అన్నాన్ని తెచ్చింది. ఆయన, 'అయ్యో, నీకు నేను తెచ్చిపెట్టవలసినది బదులు నీవాటా నేను పుచ్చేసుకోవడమా? ఏ భర్తా తనభార్యకిలాంటి అన్యాయం చెయ్యడు' అని వాపోయాడు. అందుకామె, 'అబ్బే, ఇందులో అన్యాయమేముంది? అన్నాతురుడైవచ్చిన అతిథికి ఆకలితీర్చడంలో నాకూ బాధ్యతఉంది.' అంటూ తన అన్నాన్ని ఆ వృద్ధబ్రాహ్మణునికి వడ్డించేసింది.

"ఆ అతిధి ఆ అన్నాన్నికూడా తిని వెయ్యటానికి, వడ్డించినంతసేపైనా పట్టలేదు. తినేసి 'ఇంకా కావాలి' అన్నాడు.

"'మహాత్మా, ఇదిగో సిద్ధంగావుంది. ఆరగించండి' అంటూ సక్తుప్రస్థుని కుమారుడు తనవాటా అన్నాన్ని తెచ్చివడ్డించాడు.

"అతిధి అదికూడాతినేసి, 'నా ఆకలి తీరలేదు. ఇంకలేదా?' అన్నాడు.

"ఆమాటవిని సక్తుప్రస్థుని కోడలు మహదానందంతో, 'మహాత్మా, నా అత్త మామలూ, నా భర్తా ధన్యులైనట్లే నేను కూడా ధన్యురాలి నవటానికి అవకాశం వచ్చింది. ఇదిగో, ఈ అన్నం కూడా భుజించండి" అంటూ తన అన్నాన్నికూడా తెచ్చి, వడ్డించింది. అతిధి ఆ అన్నంకూడా తినేసి, 'నాకడుపు నిండింది.' అంటూ లేచి, అవతలకి వెళ్ళి చెయ్యి కడుక్కు న్నాడు. అతని చేతినుంచి నీళ్ళతోబాటు పడ్డ మెతుకులకోసం ఆశపడి వచ్చి ఈ ముంగి తన కుడిపక్క బంగారం చేసుకుంది.

"అంతవరకూ ముసలిబ్రాహ్మడికి మల్లే ఉన్న ఆ అతిధి ఓ దివ్యపురుషునికి మల్లే మారిపోయాడు. ఆయన తేజస్సుచూసి సక్తుప్రస్థుడూ వాళ్ళూ ఆశ్చర్యపోయి, 'మహాత్మా, మమ్మల్ని అనుగ్రహించ టానికి ఈ అతిధిరూపంలో వేంచేసిన శ్రీ మహావిష్ణువే మీరు!' అని స్తోత్రం చేశారు. అందు కాయన 'నేను మిమ్మల్ని పరీక్షిద్దా మని వచ్చిన యమధర్మరాజును. మీ అతిథ్యానికి మెచ్చుకున్నాను. నాలుగు రోజులనుంచి తిండిలేక, తిందామని వడ్డించుకున్న సిద్ధాన్నాన్ని మనస్ఫూర్తిగా అతిథికి ఇచ్చేశారు. మీ చిత్తశుద్ధి గొప్పది. ఈ పుణ్యానికి ఫలంగా మీకు బొందితో కైలాసానికి వెళ్ళేటట్లు వరంఇచ్చాను' అని చెప్పి, అంతర్ధానమయాడు. మరి కాసేప టికి కైలాసంనుంచి విమానంవచ్చి, ఆ నలుగుర్నీ కైలాసం తీసుకుపోయింది."

ఈ కథ విన్న ధర్మరాజు, పంచభక్ష్య పరమాన్నాలతో భోజనంపెట్టి, బంగారు పాత్రలు దక్షిణగా ఇచ్చినా తన అన్నదానం సక్తుప్రస్థుని అన్నదానంముందు ఎందుకూ పనికిమాలిన దైనదని తెలుసుకుని చిన్న బోయి మౌనంగా యజ్ఞశాలకు తిరిగి వచ్చాడు.






అనగనగా ఒక రాజు. అయన ప్రజలను కన్నబిడ్డలవలె పాలిస్తూఉండేవాడు. అందుచేత, రాజుపైన అందరకూ భక్తీ, గౌరవమూ ఎంతగానో ఉండేవి. ఆ రాజు పరిపాలన చేసే పద్ధతి చాలా చక్కగా ఉండటంచేత, ప్రజలెంతో సుఖంగా వుండేవారు.

దేశాలు తిరిగివచ్చే సాధువులనూ, యాత్రలు సేవించుకువచ్చే పుణ్యాత్ములనూ అదరించటమంటే ఆ రాజుకు అమితమైన ఆసక్తి. అటువంటివా రెవరైనా వచ్చినట్టయితే అదేపనిగా వారితో సంభాషిస్తూ, చర్చలు జరుపుతూ, లోకచరిత్ర తెలుసుకునేవాడు. దేశంలో మంచిమంచి విషయాలు ఈవిధంగా తెలుసుకొని, వాటి నన్నిటినీ తన రాజ్యంలో అమలుచేసేవాడు. అందుచేత, అయన పరిపాలన ప్రజలకు సౌఖ్యంగావుండి, ఆ రాజ్యం రామరాజ్యం అనిపించుకొంటున్నది.

అయితే, ఆ రాజ్యానికి చీడపురుగులాగ, రాజువద్ద కుటిలుడైన ఒక మంత్రి ఉండేవాడు. అతనికి డబ్బుఖర్చు అంటే కిట్టదు. అందులోనూ సాధువులంటే అసలే మంట. సాధువులనగా దేశదిమ్మరులైన సోమరిపోతులనీ, వాళ్ళను అదరించటం మహాపాపమనీ అతని వుద్దేశం.

ఇలా వుండగా ఒక రోజున ఒకస్వామి ఈరాజ్యానికి వచ్చాడు. రాజు ఈస్వామిని ఆహ్వానించి తీసుకువచ్చి, అయనవల్ల లోకజ్ఞానాన్ని ఇచ్చే విషయాలు ఎన్నో విన్నాడు. పది రోజులు, పదిహేను రోజులైనా, ఆ స్వామి చెప్పే క్రొత్త విషయాలకు అంతూ పొంతూ లేకుండావుంది. అప్పుడు రాజు "స్వామీ! మీరు కొంతకాలం మా అస్థానంలో ఉండి మాకు జ్ఞానబోధచేసి, తరణోపాయం చూప" మని కోరాడు. అందుకు స్వామికూడా ఒప్పుకొన్నాడు.

ముద్దా సోమప్పశాస్త్రి, మదరాసు



ఈ స్వామి వచ్చినప్పటినుంచీ రాజుకు పరమార్థచింత ఎక్కువైపోతున్నది. ఇది చూచి, మంత్రికి స్వామిపైన చెప్పలేని ద్వేషం కలిగింది. తన బుద్ధిబలంవల్ల ఏదైనా ఉపాయంచేసి, స్వామికి ఆస్థానంలోనించి ఉద్వాసన చెప్పించాలని నిశ్చయించుకొన్నాడు. ఈ సంకల్పంతో, రాజు ఒంటిపాటుగా ఉన్నప్పుడల్లా అదనుచూచి, స్వామినిగురించి విరుగుడు మాటలు చెప్పనారంభించాడు.

"సాధువుల సంగతి నీకు తెలియదు. వారు భూలోకంలో సంచారం చేసే దైవస్వరూపులు. వారి జ్ఞానబోధవల్లనే మానవజాతికి ముక్తిమార్గం తెలుస్తుంది," అని రాజు మంత్రిని మందలించేవాడు. కాని, మంత్రి పట్టు విడువక, స్వామినిగురించి ప్రతికూలంగా రాజుకు నూరిపోస్తూనే వున్నాడు. మంత్రి ఎంతచెప్పినా, అంతకంతకు రాజుకు స్వామిపైన గౌరవం హెచ్చుతున్నదేగాని, కొంచెమైనా తగ్గలేదు.

చివరకు ఒకనాడు, స్వామి ఒంటరిగా ఉండటం కనిపెట్టి మంత్రి అతి వినయం నటించి, అయనను తన ఇంటికి భిక్షకు రమ్మని పిలిచాడు. స్వామి అంగీకరించి, మంత్రి ఇంటికి వెళ్ళాడు. భోజన సమయమైంది. వడ్డన అంతా జరిగినతరువాత మంత్రి "స్వామీ! పదార్థాలలో వెల్లుల్లి వేసుకోవటం మాదేశాచారం. గురువులకూ, పెద్దలకూ విందు చేసేటప్పుడు తప్పక ఉపయోగించాలి. తమ కేమీ అభ్యంతరం ఉండదనుకొంటాను," అనేవరకు, "అభ్యంతరం లే"దన్నాడు స్వామి.

మంత్రిమాత్రం ఏదో సాకుచెప్పి, స్వామివారి బంతిని భోజనానికి కూర్చోవటం తప్పించుకున్నాడు. స్వామి భోజనానికి కూర్చోగానే మంత్రి కోటకు వెళ్ళి, "రాజా! సాధువులంటే వంచకులని నేనెంత చెప్పినా



మీరు నమ్మకపోతిరి. ఇప్పుడు మహాను భావుడని భ్రమపడుతున్న స్వామి పరమ దొంగ, వానికి నీతి నియమంలేదు, జిహ్వ కట్టిపెట్టుకోలేడు. నానా గడ్డి తింటాడు. కూడని ఆ నీచుణ్ణి మీరు పక్కన కూర్చో బెట్టుకుంటున్నారంటే లోకం నవ్వి పోతున్నది. ఎందుకులెండి. నామాట నిజమో కాదో తమకే తెలుస్తుంది" అని చెప్పేసి ఇంటికి వెళ్ళాడు.

ఇంతలో స్వామి భోజనమైంది. ఆయనతో మంత్రి "స్వామీ! ఒక్కసంగతి చెప్ప మరిచాను. ఇవాళ రాజుగారి జన్మ దినం. ఆయనకు ఉల్లివాసన కిట్టదు. వారితో ప్రసంగించేటప్పుడు వాసన కొట్ట కుండా చూచుకోండి"అని సలహాచెప్పాడు.

ఈ మాట వినగానే స్వామి నోరు బాగా కడుక్కొని మామూలుగా కోటకు వెళ్లాడు. కాని, వెల్లుల్లివాసన ఇంకా ఉన్నదేమో అనే అనుమానం తీరక, స్వామి రాజుకు దూరంగా కూర్చున్నాడు. రాజు పలక రించగా, ఉల్లివాసన కొడుతున్నదేమోనని జంకుతో అటువైపు తిరిగిచూడసాగాడు.

రాజుకోరినప్పటికీ స్వామి ఉన్నతాసనం మీద కూర్చోక, దూరదూరంగా తప్పకొనే సరికి, రాజుకు మంత్రిమాటలపై నమ్మకం కలిగి, స్వామి పరమదుర్మార్గుడేనని తలచాడు. ఇటువంటి దుర్మార్గుడికి మరణమే తగిన శిక్ష అని నిశ్చయించాడు.

ఈ రాజు ఎవరైనా దుర్మార్గులను చంపించదలిస్తే ఒక చిత్రమైన ఏర్పా టున్నది. అదే రహస్యమందిరం. రాజు స్వయంగా చీటీ వ్రాసి, ఎవరిని ఆ మంది రానికి పంపితే వారికి అక్కడ మరణశిక్ష విధింప బడుతుంది. చీటీలో చూచేవారికి 'బహుమతి ఇంత ఈయవలసింది' అనే మాటలు కనబడి, ఆశ కలుగుతుంది. తీరా మందిరంలోకి పోయేవరకు జరగవలసిన

పని జరుగుతుంది. ఈ రహస్యం మంత్రికి కూడా తెలియదు.

రాజు స్వామిని పిలిచి "మహాత్మా! తమరువచ్చి చిరకాలమైంది. మిమ్మల్ని ఇక్కడనే మేము నిలిపివేసినట్టయితే, మీవల్ల ఉపదేశం పొందవలసిన శిష్యకోటికి అన్యాయం చేసినట్టవుతుంది. కనుక భక్తి పూర్వకంగా సమర్పించుకొంటున్న ఈ వేయివరహాలూ స్వీకరించండి" అంటూ, పత్రం చేతికిచ్చి 'రహస్యమందిరానికి వెళ్ళి సొమ్ము తీసుకోండి!' అన్నాడు.

ఈ సంగతులన్నీ గమనిస్తూవున్న మంత్రి, ఆ బహుమానము తానే కాజేదామన్న దురుద్దేశంతో, స్వామిని దర్శించి, "మహానుభావా! తమరేమిటి, మందిరానికి వెళ్ళడమేమిటి? మీరు శ్రమపడటం భావ్యం కాదు. తమరు మా ఇంటిలో నిశ్చింతగా కూర్చోండి, నేను ఇప్పుడేపోయి బహుమానపు సొమ్ము పట్టుకవచ్చి సమర్పించుకుంటాను" అంటూ స్వామిని తన ఇంటిలో కూర్చుండబెట్టి, మంత్రి ఆ చీటి తీసుకొని మందిరానికి చేరుకొన్నాడు.

రహస్య మందిరంలోని ఉద్యోగులు ఈ చీటి చూచుకొంటూనే, మంత్రిని మటు మాయం చేసివేశారు. సాయంత్రమైనా మంత్రి రాకపోయేవరకు, స్వామి అనుమానపడి రహస్య మందిరానికి వెళ్ళాడు. "మాకు తెలియదు, రాజుగారినే కనుక్కోండి" అన్నారు అక్కడి ఉద్యోగస్థులు.

స్వామి మళ్ళీ ప్రత్యక్షమయేవరకు, రాజు ఆశ్చర్యపోయాడు. తరువాత స్వామి, జరిగినకథ చెప్పగా, మంత్రి ఆడిన కపట నాటకమంతా రాజుకి బోధపడి నిజానిజాలు తెలిసిపోయినై. అతను తగినట్టుగా పాపఫలం అనుభవించటంతో రాజుకు స్వామి బోధలయందు విశ్వాసం ఎక్కువై, నాటినించి ఆయనను గురుదేవునిగా తన ఆస్థానమందే శాశ్వతంగా నిలుపుకొన్నాడు.






ద్రామలచెఱువు అనే గ్రామంలో ధర్మారెడ్డి అనేరైతు ఉండేవాడు. అతని భార్య ఒకే ఒక్క కొడుకుని కని పాపం, చనిపోయింది. ఆ తల్లిచావుపిల్లవానికి 'ఓబిరెడ్డి' అని పేరు పెట్టి ధర్మారెడ్డి ఎంతో గారంగా పెంచాడు.

ఓబిరెడ్డి అట్టే చుఱుకైనవాడుకాడు. మందబుద్ధికితోడు అమాయకుడుకూడాను. తండ్రిచేసిన గారంకూడా తోడై ఆ కుర్రవాడు ఎందుకూ పనికిరానివాడయాడు.

ధర్మారెడ్డికి తాను ఉన్నంతకాలం తన కొడుక్కి యేమీ ఫరవాలేదుగాని తను పోయాక వాణ్ణి యెవరు చూస్తారా, అన్న చింత పట్టుకుంది. అతగాడిని అన్నప్పశాస్త్రి అనే స్నేహితునివద్ద చదువుకి పెట్టాడు.

అన్నప్ప ఓబిరెడ్డికి సుమతీశతకం ప్రారంభించి రోజు కొక పద్యం చెప్పేవాడు. కాస్త లెక్కా, డొక్కాకూడా నేర్పటానికి ప్రయత్నించాడు.

ఓబిరెడ్డికి ఇరవయ్యేళ్ళొచ్చాక ధర్మారెడ్డి చనిపోయాడు. అప్పటికింకా ఓబిరెడ్డికి సుమతీశతకం పూర్తికాలేదు. తండ్రి పోవటంతోనే చెడ్డస్నేహాలు ఎక్కువై, వాడు చదువు మానేశాడు. 'ఎవడిఖర్మం వాడిది మనకెందుకు' అని అన్నప్ప ఊరుకున్నాడు.

ధర్మారెడ్డికి ఇరవై యకరాల భూమి ఉంది. అతడు పోవటంతోనే ఆ భూమికి ఓబిరెడ్డి అధికారి అయాడు. 'స్నేహితులం, చుట్టాలం' అంటూ అతని చుట్టూ చేరిన వాళ్ళంతా 'ఆ భూములన్నీ మేం చూసి పెడతాం' అనిచెప్పి, వాటిపైన వచ్చిన డబ్బంతా కాజేస్తొండేవారు.

ఇదంతా చూస్తున్న అన్నప్పశాస్త్రికి చాల బాధగానేఉండేది. ఒకరోజున ఆయన ఓబయ్యని రహస్యంగా పిలిపించి, "ఓబయ్యా. ఈ చుట్టాలూ, స్నేహితులూ

పి. వెంకమాంబ, మాంబళం



నీడబ్బుకోసం చేరేరు. అదంతా దోచుకుని తర్వాత పికరు లేకుండా పోతారు.

'ఎప్పుడు సంపద గలిన
నప్పుడె బందుగులువత్తు రదియెట్లనినన్,
తెప్పలుగ చెఱువు నిండిన
కప్పలు పదివేలుచేరు గదరా సుమతీ'

అన్న పద్యం జ్ఞాపకం తెచ్చుకో" అని కూకలేసి పంపేశాడు

ఓబయ్య ఇంటికొచ్చి, అక్కడున్న తన చుట్టాలనూ, స్నేహితుల్నీ చూసి, 'ఫొండయ్యా, ఫొండి. రేపట్నుంచి నా గడప తొక్కవద్దు' అంటూ, 'ఎప్పుడు సంపద గలిగిన' అన్న పద్యం చదవసాగాడు.

'అబ్బో! ఓబయ్యా అమాయకుడను కున్నాం. గడుసువాడే!' అనుకుంటూ వాళ్ళు ఒక్కొక్కళ్ళే తిరిగి వెళ్లిపోయారు.

ఒకనాడు శేషారెడ్డి అన్నతడు, చారెడు వేరుశనగకాయలు తెచ్చి ఓబయ్యకు ఇచ్చాడు. చెంగారెడ్డి చిరగడ దుంపలు పట్టుకొచ్చాడు. తిమ్మారెడ్డి తేగలూ, బసివిరెడ్డి బటానీలూ పట్టించుకొచ్చి, కాన్కలు పెట్టేరు. సింగన్నరెడ్డి సినిమాకీ, కామారెడ్డి కాఫీహొటలుకీ లాక్కుపోయారు.

వేరుశెనక్కాయల కమ్మదనం, గెనుసు గడ్డల తీపి, సినిమాషోకూ, కాఫీహొటలు మజాలలో ఓబయ్యా సుమతీశతకం లోని 'కప్పల' పద్యం మరిచిపోయాడు.

మళ్ళీ ఈ జట్టంతా ఓబయ్యచుట్టూ చేరడంచూచి అన్నప్పశాస్త్రి ఎంతో విచారించసాగాడు.

* * *

రోజులు గడిచిపోయాయి. ఓబయ్యకి తండ్రి నిలవచేసివెళ్ళిన డబ్బంతా హారతి కర్పూరంలా హరించిపోయింది. శేషారెడ్డి, తిమ్మారెడ్డి, చెంగారెడ్డి, బసివిరెడ్డి, సింగన్నరెడ్డి వీళ్ళంతా ఓబయ్యకి అప్పులు పెట్టడం ఆరంభించారు.

అన్నప్పశాస్త్రి ఉండబట్టలేక ఒకరోజున ఓబయ్యని పిలిపించి, 'ఓబయ్యా, అప్పులు చేస్తున్నావట. అప్పు ముప్పు దెస్తుంది. జాగ్రత్త. ఆ పోకిరి మూకని చేరనివ్వకు' అని హెచ్చరించి పంపేశాడు. ఓబయ్య బుద్ధితెచ్చుకుని, ఆ వేడి పోకుండా ఇంటికి తిరిగివచ్చి, ఇదివరకు మల్లెనే మళ్ళీ 'ఫాండి ; రేపట్నుంచీ నా గుమ్మం తొక్కకండి' అని స్నేహితుల్ని తరిమేశాడు.

'ఏమిటి తిమ్మారెడ్డీ, ఓబయ్య మధ్య మధ్య మనల్ని ఇలా పొమ్మంటున్నాడు? వీడి వాలకంచూస్తే, మనల్ని ఇంక చేరనివ్వడులాగుంది' అన్నాడు శేషారెడ్డి.

'ఎలాగైనా వీణ్ణి మాయచేసి వీడి భూమి అంతా మనపేర రాయించేసుకోవాలి తొరగా. ఆతరువాత వీడు మనల్ని రమ్మని బ్రతిమాలినా, ఆ గడపవైపు తొంగి చూడనక్కర్లేదు' అన్నాడు తిమ్మారెడ్డి.

'అలాగైతే ఒకదస్తావేజు తయారుచేసి తెస్తాను. నావద్ద తాను పుచ్చుకున్న ఋణానికి తీర్మానంగా తనభూమి నాకు చెందేటట్టు రాయించుకుంటాను. ఆ భూమిని మనం అందరమూ సమంగా పంచుకుందాం' అన్నాడు సింగన్నరెడ్డి.



'నువ్వు వాడికిచ్చినది, పాతికా, యాభై ఇలాంటి చిన్న మొత్తాలేగా. ఈ చిన్న మొత్తాలకోసం భూమంతా రాయించుకుంటే ఆ దస్తావేజు చెల్లుతుందా?' అన్నాడు కామారెడ్డి.

'నిక్షేపంలా చెల్లుతుంది. పాతికా, యాభై అని రాస్తానా? పదివేల రూపాయిలు అప్పు పుచ్చుకున్నాడని రాస్తాను' అన్నాడు సింగారెడ్డి.

అంతలో చెంగారెడ్డి అడ్డుతగిలి, 'అది సరేగాని, దస్తావేజు మీద ఓబయ్య కళ్ళు మూసుకు సంతకం పెడతాడంటావా?' అన్నాడు.



'ఎందుకు పెట్టడు? దస్తావేజులో ఏముందో వాడి కర్థంకాకుండా గొలుసు కట్టులో రాసేస్తాను. పెద్ద అచ్చులో ఉన్న సుమతీశతకం చదవటంతప్ప, ఓబయ్యకి దస్తావేజులు చదవటం తెలుసా? తాటి కాయల్లాంటి అక్షరాలతో సంతకం మాత్రం పెడతాడుగాని మరొకటి రాయటంకూడా చేతకాని పెద్దమ్మ. ఇంతకూ, ఓబయ్యతో ఇది దస్తావేజని చెబుతామా?' అన్నాడు సింగన్నరెడ్డి. వాళ్ళంతా సరేనన్నారు.

సింగన్నరెడ్డి దస్తావేజు తయారుచేసి తెచ్చాడు. ఓబయ్యని ఎలా మోసం చెయ్యాలో ఆలోచించుకుని మర్నాడే వాళ్ళంతా కల్లబొల్లి ప్రేమ కనపరుస్తూ ఓబయ్యయింటికి చేరుకున్నారు.

ఓబయ్య సుమతీశతకంలో తనకొచ్చిన పద్యాలన్నీ ఒకమాటు నెమరుకు తెచ్చు కుంటున్నాడు. వాళ్ళంతా వచ్చేవేళకి,

"మాటకు ప్రాణము సత్యము
కోటకు ప్రాణంబు సుభటకోటి ధరిత్రిన్
చేటికి ప్రాణము మానము
చీటికిప్రాణంబువ్రాలు సిద్ధముసుమతీ"

అన్న పద్యం చదువుతున్నాడు.

శేషారెడ్డి, "చూశారన్రా, మన ఓబయ్య పద్యాలెంత బాగా చదవగలడో!" అని మెచ్చుకున్నట్లు నటించాడు.

"చదవటమే కాదు; మన ఓబయ్య దస్తూరీ ఎంత బాగుంటుం దనుకున్నావ్? ముత్యాలకోవ! సంతకం అంటే ఓబయ్యదే సంతకం!" అన్నాడు కామారెడ్డి.

"ఒహెూ, అలాగునా? ఏదీ చూద్దాం! ఓబయ్యా, యీ కాగితం మీద ఆ ముత్యాల కోవ సంతకం చెయ్యి." అంటూ సింగన్న రెడ్డి తాను తయారుచేసి తెచ్చిన దస్తావేజు పైకితీశాడు. చెంగారెడ్డి కలం అందించాడు. తిమ్మారెడ్డి సంతకం పెట్టేచోటు చూపించి 'ఇక్కడ' అనేటప్పటికి, ఓబయ్య అక్కడ

'చక్రాల ఓబిరెడ్డిగ్రావాలు' అని పెద్ద పెద్ద అక్షరాలతో సంతకం పెట్టేశాడు.

సింగన్నరెడ్డి చెప్పినట్లు ఆ దస్తావేజులో ఏముందో ఓబయ్య చూడనేలేదు. తన సంతకంకేసి చూసుకుంటూ, ఆ పైనఉన్న కలిపిరాతలోని చిన్న అక్షరాలకన్న తనపెద్ద అక్షరాలే బాగున్నాయని మురిసిపోయాడు.

సింగన్నరెడ్డి, "ఓబయ్యా, భలేబాగా ఉందిరా నీ సంతకం! ఏదీ ఆ కాగితం ఇలా ఇయ్యి" అన్నాడు.

"నీకెందుకు?" అన్నాడు ఓబయ్య.

"ఎందుకా? చూస్తే ముద్దొస్తోంది నీ సంతకం. ఈ కాగితాన్ని నేను అద్దం, చట్టంకట్టించుకుని, పటానికిమల్లే చక్కగా గోడకి తగిలించుకుంటాను" అన్నాడు సింగన్నరెడ్డి.

సింగన్న యీ మాట అనేటప్పటికి ఓబయ్యకి ఇంకా గర్వం ఎక్కువైపోయింది. ఆ కలిపిరాతను తనసంతకంతో పోల్చుకునే టప్పటికి అతనికో ఆలోచన తోచింది.

దస్తావేజులో తన సంతకం ఉన్న అడుగుభాగాన్ని మటుక్కి పరపరా చింపి, "ఇదిగోరా సింగన్నా, నా సంతకం. అద్దంకట్టించు" అంటూ సింగన్న చేతిలో



పెట్టేడు. తనచేతిలో మిగిలిన దస్తావేజు కాగితాన్ని చింపి వీధిలో విసిరివేశాడు.

సింగన్నకు వొళ్ళు మండిపోయి, "భడవా, దస్తావేజు చింపేస్తావా?" అంటూ ఓబయ్య జబ్బ పట్టుకున్నాడు. తక్కిన వాళ్ళు ఓబయ్యని చుట్టుముట్టేరు.

తనని వాళ్ళలా తన్నటాని కెందుకు సిద్ధ మౌతున్నారో తెలియక ఓబయ్య బెదరి పోయి, కేకవేశాడు. సరిగా ఆదేసమయాని వీధిలో పోతూన్న అప్పన్నశాస్త్రికీ, మరి కొందరికీ ఆ కేకలు వినిపించి వాళ్ళంతా లోపలికి చొరబడి, ఓబయ్యని విడిపించి సంగతేమిటని అడిగేరు.

ఓబయ్య అంతకుముందు నలిపి విసిరేసిన కాగితం ఉండని వెతికితెచ్చి, ముడత విప్పి అన్నప్పశాస్త్రిచేతిలో పెట్టేడు. "నా దస్తూరి బాగుంటుందనిచెప్పి వీళ్ళు యీ కాగితంమీద నా సంతకం పెట్టించారు. ఈ కాగితానికి అద్దంకట్టించుకుంటా నన్నారు. 'నా సంతకం కదా వీళ్ళకి బాగున్నది? చట్రం కట్టిస్తే అదిమాత్రమే కట్టించుకోవాలి. నా సంతకంతోబాటు ఈ వెట్టిమొట్టి కంకిరి రాతకూడా ఎందుకు?' అని తోచి, నా వ్రాలున్న భాగంమాత్రం చింపి ఇచ్చి, ఈ పైభాగం నలిపి అవతల పారేశాను" అన్నాడు ఓబయ్య.

అన్నప్పశాస్త్రి దస్తావేజంతా చదివి, "ఎంతద్రోహం తలపెట్టారు దుర్మార్గులు?" అంటూ చుట్టూచూశాడు.

కాని అక్కడెవరున్నారు? రహస్యం బైట పడగానే అప్పటికప్పుడే ఆ దుర్మార్గులంతా మెల్లగా అక్కడనుంచి జారిపోయారు.

"ద్రోహమేమిటి బాబయ్యా?" అన్నాడు ఓబయ్య.

"ఈ దస్తావేజుమీద నీ వ్రాలుపెట్టించి పట్టుకుపోయి నీభూమి దఖలుపరుచుకుందామనుకున్నారు వీళ్ళు. 'అద్దం కట్టించుకుంటా'మని నిన్ను ఉబ్బేసి, దస్తావేజు నీవద్దనుంచి పుచ్చుకుందామనుకున్నారు 'చీటికిప్రాణంబువ్రాలు సిద్ధము సుమతీ' అన్న పద్యం నువ్వు అప్పుడే మరిచిపోయావా? నీవ్రాలు ఈ దస్తావేజులో ఉన్నప్పుడే వాళ్ళకి ఉపయోగం. వాళ్ళ ప్రయత్నం ఇలా భగ్నమై పోయిందన్న ఉడుకుమోతుతనంతో నిన్ను తన్నబోయారు" అన్నాడు అన్నప్పశాస్త్రి.

"ఎంత మోసం తలపెట్టేరు దుర్మార్గులు?" అని ముక్కుమీద వేలెట్టుకున్నారు వచ్చినవాళ్ళంతా.

"అమాయికులను భగవంతుడిలాగే కాపాడుతుంటాడు" అన్నాడు అన్నప్పశాస్త్రి.



## చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

### ఆధారములు

**అడ్డము :**

1. భారతదేశంలో నది
4. సీత
7. కవిత్వము
8. మన్మదనము
9. స్త్రీలు ధరించునది
11. గుర్రము




**నిలువు :**

2. ఒక తెలుగు కవి
3. కోకిల
4. పండుగ.
5. కోపము
6. శత్రువులు
10. రెండవ తిథి

### మోసము

సంతలోన జరిగినట్టి వింత యేమన
డబ్బుచేతబట్టి వేణు తావి తీవిగ
నడచుచుండ వానిచెంత కరిగె రాముడు
ఊరుకోక వానితోడ నిట్లు చెప్పెను ,

'డబ్బు నీవు జాగ్రతగను దాచకుండిన
దారిలోన నీదు డబ్బు ధారపోవును
అందువలన నిపుడె నీదు సంచియందున
గట్టిగాను ముడిని వేసి కట్టి యిచ్చెద.'
అనుచు వాని సంచి తీసి కట్టి యిచ్చెను.

చాలదూర మతనితోడ చనిన పిమ్మట
యింటినొకటిచూపి యిటులచెప్పె వానితో :
'ఇదియె నేనుయుండునట్టి యిల్లు మిత్రమా
పోయివచ్చె'దనుచు రాము సాగిపోయెను.

అంత వేణు సంచి నొక్క చేత బట్టుక
యింటి చెంతకేగి దాని విప్పిజూచెను.
డబ్బు గిబ్బు యేమిలేదు దానిలోపల
చిత్తుపేపరొకటిమాత్ర మందుయుండెను.

వేణు దానిజూచి వెక్కి వెక్కి యేడ్చుచు,
రాముయింటియందు నుండునామెతోడను
యింతవరకు జరిగినట్టి వింతజెప్పెను.

'ఇచ్చటెవరు రాములేడు యేమిసేతువు?'
అనుచు నామె బదులు పలికి లోనికేగెను
వేణు కేమి చేయుటకును మనసుతోచక.
వెక్కి వెక్కి యేడ్చి యింటి కెళ్ళిపోయెను.

చూచితివా ! లోకమెంత చిత్రమైనదో !!
మంచివారి నందరిని మోసగించును.
ఇంతవరకు చదివినట్టి విషయమంతయు
సత్యముగా జరిగె నయ్యె చాలవెనుకను.

[ రచన : జి. గోపాల్, మదరాసు ]




# పిల్లల పెంపకం

## నడక

ఒక్క తల్లి కన్న బిడ్డలలోనే శరీరతత్వంలోనూ, మనస్తత్వంలోనూ ఎంతో అంతరం వుంటుంది. కనుక శిశువుల పెరుగుదలలో కనపడే వ్యత్యాసానికి ఆశ్చర్యపడ నవుసరం లేదంటాను.

"మా అబ్బాయికి నాలుగోమాసం వెళ్లిన నాలుగో రోజుకే పళ్ళు వచ్చేశా" యనీ, "మా చిట్టివాడు పదోనెల రాకుండానే అడుగులు వేస్తున్నా" డనీ కొందరు తల్లులు గొప్పగా చెప్పుకొంటారు. శరీరతత్వాన్నిబట్టి కొందరు పిల్లలకు ఒక్కరవ్వ పళ్ళు పెందరాళే రావచ్చు, కొందరు బిడ్డలు ముందుగానే అడుగులు వేయటం ప్రారంభించవచ్చు. ఇంతలో పెద్ద గర్వపడేదేమిటి ?

శరీరం బరువు అంతా కాళ్ళు మోయగలిగే స్థితి వచ్చినప్పుడు శిశువు లేచి అడుగులు వేయటానికి ఆరంభిస్తాడు. సామాన్యంగా ఇది తొమ్మిది పది నెలలప్పుడు జరుగుతుంది. ఏడాది వెళ్ళకముందు బిడ్డ తనంతట తనే బాగా నడుస్తాడు. ఆహారం విషయంలో ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ, కొవ్వు ఎక్కువవల్ల కొందరు బిడ్డలు బరువెక్కి స్థూలంగా వుంటారు. అటువంటి శిశువులు నడవటంకంటె పాకడమే మేలు. పాకడంవల్ల శరీరంలోఉండే అనవసరమైన కొవ్వు తగ్గిపోతుంది.

బిడ్డడు నీప్రక్కని నడిచేటప్పుడు ఎన్నడూ చెయి పట్టుకోవద్దు. 'పాపా! నా వేలు పట్టుకు నడూ' అని చెప్పి, అలా అలవాటు చేయాలె. బిడ్డని యిష్టంవచ్చినవేపుకి నడవనీ. అంతేకాని, నీ యిష్టప్రకారం శిశువు నడుచుకునేటట్టు నిర్బంధించటానికి ప్రయత్నించవద్దు.

చాలామంది తల్లులు, ఎదిగిన పిల్లలనుకూడా తోపుడుబండిలోనించి దింపరు. ఇది మంచిది కాదు. బిడ్డలను నడవనీయాలె. ఎదిగే బిడ్డలకు నడక చాలా అవసరం.

'మీ పెద్దమ్మ'



ఇది ఏడు భాగాలుగా కోసిన ఒక జంతువు బొమ్మ. ఈ భాగాలని ఒకవిధంగా కలిపితే ఆజంతువేదో తెలిసిపోతుంది. మీరు యిది చెయ్యగలరా? మీకు చేతగాకపోతే జవాబుకు 55-వ పేజీ చూడండి.





ఇక్కడ 1 నించి 37 వరకు చుక్కలు వున్నయి కదూ? ఇవి వట్టి చుక్కలు కావు. వాటిల్లో ఒక దొంగ దాక్కొని వున్నాడు. చుక్కల్ని పెనిసిలు తో 1 నించి వరుసగా కలుపుకొంటూపోతే ఆ దొంగ ఎవరో దొరికిపోతాడు. చుక్కల్ని కలిపి చూడండి.





# అంకెల తమాషాలు





## అంకెల గోపురం

$$1 — \times 8 + 1 = 9$$
$$12 — \times 8 + 2 = 98$$
$$123 — \times 8 + 3 = 987$$
$$1234 — \times 8 + 4 = 9876$$
$$12345 — \times 8 + 5 = 98765$$
$$123456 — \times 8 + 6 = 987654$$
$$1234567 — \times 8 + 7 = 9876543$$
$$12345678 — \times 8 + 8 = 98765432$$
$$123456789 — \times 8 + 9 = 987654321$$

---

## యుక్తి లెక్క

ఒకవూళ్ళో ఏడుగురు దొంగలు జట్టుగా వుండేవాళ్లు. ఒకరోజున వాళ్లు ఒకానొక భాగ్యవంతుని యింట్లో దొంగతనానికి వెళ్లారు. మొదట, వాళ్ళల్లో ఒకడికి ఒకరూపాయిల సంచి దొరికింది. ఇంతలో ఆ యింటివాళ్లు లేచిన అలికిడి అయేసరికి దొంగలు ఏడుగురూ తలాఒకవైపు పారిపోయారు. డబ్బుసంచి దొరికినదొంగ ఒక అడవి చేరుకుని ఆ సంచివిప్పి రూపాయిలు లెక్కపెడుతుండగా దొంగలజట్టులో ఒకదొంగవచ్చి అతన్ని చేరుకున్నాడు. సంచిలోవున్న రూపాయిల్ని వాళ్ళిద్దరూ పంచుకుంటే ఒక రూపాయి మిగిలింది. ఇంతలో మూడోదొంగ వచ్చాడు. అప్పుడు వాళ్లుముగ్గురూ పంచుకోగా మళ్లీ ఒకరూపాయి మిగిలింది. ఇంతలో నాలుగోదొంగ వచ్చాడు. ఆ నలుగురు పంచుకొన్నా మళ్ళీ ఒకరూపాయి మిగిలింది. ఇంతలో ఐదోదొంగ వచ్చాడు. ఆ ఐదుగురూ పంచుకున్నా ఒకరూపాయి మిగిలింది. తర్వాత ఆరో దొంగ వచ్చాడు. ఆరుగురు పంచుకున్నా ఒకరూపాయి మిగిలింది. ఆఖరికి ఏడోదొంగ వచ్చాడు. వాళ్లు ఏడుగురూ పంచుకోగా, ఏడుగురికీ సరిసమానంగా రూపాయిలు సరిపోయినై. సంచిలోవున్న మొత్తంరూపాయిలు ఎన్నో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.

# ముగ్గులు



ఆర్. శకుంతల, చీరాల



ఏ. రమాదేవి, మద్రాసు



బి. వనజ, కర్నూలు



యస్. జానకి, భీమవరం

## రోకటిపాటలు

ఏటికి నీళ్లెక్క చేప లెదురెక్క
వెయ్యి బెస్తకాడొక ఏటిపై వలలు.
కాల్వలకు నీళ్ళొచ్చు చేపలెదురెక్క
కట్టు కాపుబిడ్డ చుట్టు కాలువలు.

•  •  •

నిండున్న సముద్రేణి నన్నుపోనియ్యి,
పూచిన్న తంగేడు పుట్టిల్లు నాది.
ఏటికీ వెంపల్లి తీగడ్డమాయె,
నాకు నాపుట్టింటికి ఏరడ్డమాయె.

•  •  •

నిద్రవచ్చినకండ్లు నే నిలపలేను,
నీలవర్ణునిమాట నే తెలుపలేను.
చందకాడా రాడు జామున్న రాడు,
ఏలరాడో ఎరుగ నీలవర్ణుండు.

•  •  •

వూరిముందరిమోత ఏమన్నమోత?
ఉత్తముండూ అన్న ఉంద్రాళ్లమోత.
వీధిమధ్యనిమోత ఏమన్నమోత?
బాలుడు బొమ్మయ్య బొంగరాల్మోత.

•  •  •

కళ్లేపల్లి నాగన్న కడుచక్కనోడు
కల్లోను గజనిమ్మ పండ్లిచ్చినాడు.
కల్లోనుయిస్తేను కల్లలంటారు
మతికన్న యిపుస్వామి మామిడీపండ్లు.

సంపాదన: { లక్ష్మీనారాయణ
బసవపూర్ణమ్మ

## అంపకాలపాట

కసరి మాటాడకూ విసవిసలు పడకూ
పలువిచ్చి నగకుమా! పైవారి ఎదుట
తల విరియబోసుకొని తరుణిరో నీవు
వీధిలో నిలుచుట విధిగాదు సుమ్మా.
పసుపుకుంకమలిపుడు పనికిరావనుచు
పిచ్చి వేషములలో పడబోకు తల్లీ
ఫేసు పౌడర్లెంతొ భాసురంబనుచు
పూయకు మోమున 'పగటి వేషము'గా.
వంకపాపిడి దీస్తె శంకజేస్తారు
మధ్య పాపిడి చాల మంచిదే సుమ్మా.
ఆది కాలమునుంచి ఆచారమనుచు
పట్టెడు చల్దియే పెట్టుకుని తినుమా.
ఇప్పటివారెల్ల కప్పులతొ కాఫీ
తద్దినము నాడైన తప్పకుందురుగా!
నెమ్మదిగ మాట్లాడు నెలతరో యెపుడూ
బొంగుగొంతుకను వెట్టి బొబ్బరించకుమా
పరుషవాక్యము నోట పలుకరాదమ్మా.
అతిథి అభ్యాగతుల నాదరించుచును
బీదలకు భిక్షంబు ప్రేమతో బెట్టు.
అత్తపై కోపమున మొత్తబోకమ్మా
పసిపిల్లలను నీవు పంతంబుతోడ
నోరు మూయగవచ్చు నేరముండినను
లోకంబు మూతువా లోలాక్షి చెపుమా?
బాల ప్రాయమునందు తలిదండ్రులాజ్ఞ
పెద్దవైనపుడు నీ పెనిమిటి యదవు
తరువాత తనయులు తగిన శిక్షలుగా!
శిక్షలేకుండిన సిరి తొలగునమ్మా

సంపాదన:
చామర్తి కనకయ్య, అలమూరు




51-వ పేజీలోని చిక్కుబొమ్మకి జవాబు






52-వ పేజీలోని
యుక్తిలెక్కకు జవాబు

:

సంచిలో మొత్తం
**301** రూపాయిలు వున్నవి.






ఈ పులి బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (ఏప్రిల్) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor: SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B N. K. Press, Madras -1



Chandamama, March '50 — Photo by B. Ranganadham

మకరందము

